

సచిత్ర మాసపత్రిక

26, బర్కెట్ రోడ్,
టి. నగర్, మద్రాసు-17.

విడి ప్రతి వెల
1 రూపాయి

ఏడాది చందా
పన్నెండు రూపాయలు

సంపుటి 8
డిసెంబర్ 1970
సంచిక 12

మేనేజింగ్ ఎడిటర్:
వి. వి. రాఘవయ్య




Edited and Published by V. V. Raghavaiah and Printed by K. Damodaram at Sri Kala Printers, 83, Lake view Road, Madras-33.


ముఖచిత్రం
విజయా అండ్ సురేష్ కంబైన్స్
'ద్రోహి'లో
వాణిశ్రీ

# తొలిమాట

మేమనుకున్నట్లుగా - మీరాశించినట్లుగా సకాలంలో మీ చేతికి అందేటట్టు చేయలేక పోతున్నాం; న్యూస్‌ప్రింట్ బాధవల్ల - మీ ఓపికకు మా కృతజ్ఞత.

• • •

మిగతా రాష్ట్రాల్లోలాగానే ఆంధ్రలో కూడా ఝంఝూ మారుతం.

పెనుగాలి వీస్తోంది. అయితే....కొంతసేపు అటువైపు కొంతసేపు ఇటువైపూ వీస్తుంది,

[చూ. 46-74]

• • •

ఇంతకు ముందే మీకు చెప్పలేకపోయినా కిందటి సంచికలోనే ప్రచురించేం శ్రీమతి మాదిరెడ్డి సులోచన సీరియల్. పాఠకుల అభిప్రాయాలిని ఆశిస్తున్నాం. [చూ. 49]

• • •

త్వరలో కొన్ని కొత్త శీర్షికలు ప్రవేశపెట్టబోతున్నాం, మద్రాసుల్లో మిత్రుల మహకవుల రచయితల సహకారంతో—మచ్చుకొకటి —

[చూ. 96]

• • •

వచ్చే నెల నుంచి 'సినిమా'లో కూడా ఓ కొత్త శీర్షిక.

[చూ. జనవరి 71 సంచిక]




నవంబరు సంచికలో రమణారెడ్డిగారి లేఖ చదివి విస్తుపోయాను ఇంతకాలంగా వివిధ పత్రికల్లో శ్రీశ్రీ ఎందరెందరిని గురించో పరమ నీచంగా రాస్తే నోరు మెదపని వీరు నేనేదో రాశానని నన్ను నిందించబూనారు ఏదైనా తనదాకా వస్తే గాని తెలియదు నేను శ్రీశ్రీకి అర్థమయ్యే భాషలో వ్రాయడానికి ప్రయత్నించాను అంతమాత్రానికి నామీద విరుచుకుపడడం రెడ్డిగారి అల్పబుద్ధినీ అజ్ఞానాన్నీ, అసహిష్ణుతను మాత్రమే తెలియపరుస్తున్నది శ్రీశ్రీలోని అల్పబుద్ధిని అతని రాతల్లోని రోతను ఖండించలేని రెడ్డిగారికి ఇతరుల్ని నిందించే హక్కులేదని మనవిచేస్తున్నాను

—దాశరథి

నవంబర్ జ్యోతిలో ఝంఝు సమీక్షకుడు యామిజాల 'సరసం'కు వెన్నుపోటు పొడిచారు ఈనాటి దేశకాల పరిస్థితుల్ని దృష్టిలోనుంచుకొని 'ఝంఝు'ని సమీక్షిస్తే సమంజసంగా వుండేది

యామిజాల
సోమ పానవాల
పాతరుచుల తలచి తలచి
పరవశింతువేల?

—కె ప్రభాకరదేవ్ శ్రీకాకుళం

నవంబర్ 70 ముఖ చిత్రం చాలా అందముగా వుంది. ఈసారి ప్రచురింపబడిన కథలన్నీ బాగున్నాయి ముఖ్యంగా మాదిరెడ్డి సులోచన శిక్ష (సీరియల్)లో దుర్గమ్మ, ఉమాపతిలాంటి భార్యాభర్తలు, శశిలాంటివారు ఈ సమాజంలో చాలా వరకూ వున్నారు కాని, సుశీల విషయంలో మా గుండె నీరౌతున్నది సుశీల లాంటి స్త్రీలు చాలా అరుదుగా వుంటారు మొత్తానికి కొత్త సీరియల్ మా హృదయంలో పీఠం వేసుకొన్నది

ఎస్ స్వాతంత్ర రెడ్డి
ఎ మల్లయ్య
హిసామొద్దీన్
పి మనోహర్‌రావు.

అమ్ముడు పోయిన జర్నలిస్టుల షణ్ముఖా అని ఆయా ప్రాంతాల ప్రజలు చెబితే తప్ప వాస్తవాలు తెలియని ఈ కలి కాలంలో 'తురుపు' కథను ప్రచురించి నందుకు మీకు నా కృతజ్ఞతలు. ఈ కథ చదువుతోంటే చరిత్రను వాస్తవికంగానూ, నిర్భయంగానూ రికార్డ్ చేసినట్టు స్పష్ట మవుతుంది. రచయితకు అభినందనలు.

—వి. పి. రామారావు విజయనగరం.

'జ్యోతి'లో కవిత్వం ద్వారా వ్యక్తిగత ద్వేషాలకు ప్రోత్సాహం ఇవ్వడం మాకేం నచ్చలేదు

—ఎమ్. రామారావు అండ్ ఫ్రెండ్స్
బరంపురం.

శ్రీశ్రీ శిరము మంచిన చైతన్యపు
తురాయి
చూడలేని గ్రుడ్డి కొక్కిరాయి
పాటల కిరాయి
మొండి బ్రతుకునూయి
లోపడిపోయిన బండరాయి.

అభ్యుదయం ధనాధికారనివాసం
అండజేరిన నిముసం
జన్మించింది విరసం
సమసమాజ సం
స్థాపన ప్రత్యూషంకోసం.

శ్రీశ్రీ లిమరుక్కులు
పుచ్చిన సంఘానికి భిషక్కులు
అన్నార్తుడికై తెరచిన దిక్కులు
అరుస్తున్న బలిభుక్కులు
కొరకలేని ఉక్కుముక్కలు,

అగ్నిధార ఆగి
ఆకలిమంట పలుకని మూగి
సినీ నిషాలోని భోగి
సిరులసాని సంభోగి
కుళ్ళిన పాతభావాల కుష్ఠురోగి.

దాశరథి హుతభుక్కులు
దాగిన ఆరుద్ర శిఖండి నొక్కులు
చీదరగా చీదిన చీమిడిపొక్కులు
కలరారోగి దోకిన కక్కులు
మురిగిన మున్సిపాలిటీ పాయఖానా-
తుక్కులు.

—రుద్రజ్వాల, జాంద్రపేట.

నీ లోపల జీవించే
కవిహృదయం చచ్చిందా
దిగంబరుల కుళ్ళురాత
అదే నీకు నచ్చిందా

సినిమా ఎంగిలి మెతుకులు
తింటున్నది ఎవరయ్యా
ఆ మెతుకులనే తింటూ
బ్రతుకుతున్న కవివర్యా

ఏ మాత్రం ఎత్తులోన
ఉన్నావో చెప్పు
గర్వంతో సాటికవుల
నిందించుట తప్పు

వి. ర. సం. తీసుస్తుందా
పేదజనుల ఆరాటం
అది అంతా ఒక హంబగ్
యశస్సుకై పోరాటం

తొలికావ్యంతో పోయెను
నీ కవితా విస్ఫూర్తి
ఇంకా రాయాలని నీ
కెందుకింత కక్కుర్తి

—దినకర్ యువకవితా పరిషద్
విజయనగరం.

కుకవి యన నా మతంలో
ఒకడే, తన గొప్ప-ఎదిరిన్యూనత చూపే
వికలమతి, వానిపై నా
చికటారిని నూరవలతు సిరిసిరిమువ్వా!
—శ్రీశ్రీ.



రచయిత్రి: నా సీరియల్ నవల గురించి ఏమేనా అభిప్రాయాలొస్తున్నాయా?

ఎడిటర్: ఇంతకు ముందే మీ పేరుగల వొక అమ్మాయొచ్చి ఈ నవల తను రాయలేదని ప్రకటించమని ఎడ్రస్ ఇచ్చి వెళ్ళింది.

* * *

ప్లాట్ ఫామ్ మీదికి బోల్డు సామానుతో వచ్చిన భర్త రైలు అప్పుడే బయల్దేరి వెళ్ళిపోతూండటం చూసి నిట్టూరుస్తూ భార్యతో "చూశావా, ఇదంతా నువు ఒక పట్టానికి తెమలకపోవడం వల్లే జరిగింది. లేకపోతే మనకి రైలు అంది వుండేది." అన్నాడు.

భార్య: ఇది మరీ బాగుంది! మీరు అంత తొందర పెట్టకుండా వుంటే ఇంకో రైలు కోసం ఇంత సేపు ఉండుండక్కర్లే!




నాల్గు రోజుల నుండి కుండపోతగా వర్షం కురుస్తోంది. గాలి వానకు చాలా చెట్లు, టెలిఫోన్ స్తంభాలు అవీ పడిపోయాయి. ఊళ్ళో రెండ్రోజుల బట్టి కరెంటు లేదు. సముద్రం పోటు ఎక్కువగా ఉంది. కొళ్ళాయి గొట్టాలు పోయి నీళ్ళు లేవు. ఎండ ఎప్పుడు వస్తుందోనని ఎదురు చూస్తున్నారు ప్రజలు. ఎండ కోసం వాచి పోయి వున్నారు. కాలేజీలు, స్కూళ్ళు మూసేసారు బస్సులు తిరగటం మానే సాయి, ఊరంతా నిర్మానుష్యంగా ఉంది. మరో రెండ్రోజులకుగాని ఈ వర్షం తగ్గదని ఆకాశవాణి కేంద్రాలు చెపుతున్నాయి,

వర్షం మూలంగా నాలుగు రోజుల బట్టి కాలేజీకి శెలవు లిచ్చారు. అంచేత విద్యార్థుల ఎలక్షన్లు మరో పది రోజులకు

వాయిదా వేసారు. విద్యార్థులు రంగులతో గోడల మీద రాసిన స్లోగాన్లు, ఓటు వేయ మని రాసిన అభ్యర్థనలు నీళ్ళధార య్యాయి. వాచ్‌మెన్ కూడా రెండు రోజుల బట్టి రావడం మానేసాడు. కాలేజీకి ఎదురుగుండా ఓ చింత చెట్టు వుంది. అదే ప్రస్తుతం కాలేజీకి కాపలా కాస్తుంది దాని మీద పక్షులు లేవు. అవి వానవల్ల ఎక్కడికో ఎగిరి వెళ్ళిపోయాయి. చెట్టు క్రింద రోజూ నిలబడే అబ్బాయిలు లేరు. ఆ చెట్టుకు ముద్దుపేరు కల్పవృక్షం! దానికి వయసు సుమారు నూరు సంవత్సరాలు దాటింది.

* * *

'వెధవ్వాన' అనుకుంది చింతచెట్టు! నేను పుట్టి పెరిగిన ఇన్నాళ్ళలోను ఇంత పెద్ద గాలివాన ఎరగను. ఏమిటి చెప్మా వేళ్ళు లాగేస్తున్నాయి. ముసలిదాన్నయి పోతున్నాను. వెధవ గాలి కొమ్మలు ఊపేస్తుంది. నొప్పిగా వుంది. పాపం! కుర్రాళ్ళు వెర్రినాగమ్మలు. ఎంత కష్టపడి రాసుకున్నారో గోడలనిండా! అంతా వానకి చెరిగిపోయింది. నేను పుట్టి ఎన్నాళ్ళయింది చెప్మా? నూరు దాటిందను కొంటాను. అప్పటికి ఇంకా కాలేజి లేదు. హైస్కూలు ఒక్కటే వుంది. హైస్కూలు కుర్రాళ్ళు కోతికొమ్మచ్చులు ఆడుకోవడానికి వచ్చేవారు. అప్పుడు ఎంత దృఢంగా వుండేదాన్ని!

అల్లూరి సీతారామరాజుని కాల్చిచంపా రుట! అలాంటి కుర్రాడిని ఇన్నాళ్ళ జీవితంలోను మరొకడిని చూడలేదు! శర బాణం పట్టుకొచ్చి గురి చూసి కాయలు కొట్టేవాడు. చెట్టుక్రింద కూర్చుని హోం చేద్దాం రండర్రా అని తక్కిన కుర్రాళ్ళను పిల్చుకొచ్చేవాడు.

ఎంత చలాకీగా వుండేవాడు రాజు! మల్లయ్య అనుకొంటాను. చాలా లావుగా ఉండేవాడు, కుర్రాళ్ళందరిలోను చాలా పెద్దవాడు. వాణ్ని చూసి మాట్లాళ్ళక భయ పడేవారట, రోజూ తన కన్న చిన్న పిల్లల దగ్గర పెన్సిళ్ళు, పుస్తకాలు, డబ్బులు జెల్లలు కొట్టి తీసికొనేవాడు. రాజు కుర్రాళ్ళందరినీ చేరదీసి మల్లయ్యను నాకు తోడుగాకట్టి మరింకెప్పుడు అలాంటి పని చెయ్యకుండా పెళ్ళి చేసాడు. 'బల వంతమైన సర్పము చలి చీమల చేత చిక్కి చావదె సుమతీ' అనేవాడు. తెల్ల వాళ్ళను పిల్లిలా చేసిన తెలుగు పులి. పోలీసు స్టేషనులో దోపిడి చేస్తూ వట్ ఇన్‌స్పెక్టర్ కుర్చీలో కూర్చుని ఉత్తరం రాసేడు ఎంత ధైర్యం! సీతారామరాజుని మర్చిపోయారు ఇప్పటి కుర్రాళ్ళు.

సి. వి. రామన్‌ని రోజూ చూస్తుండే దాన్ని. ఏం తెలివయిన వాడు-ఇలాగే ఫిజిక్స్‌లాబ్‌కు వెళుతూ వుండేవాడు. రోజూ రాత్రి నా దగ్గిర నిలబడి ఊరికే ఆకాశం ప్రక్క నక్షత్రాల ప్రక్క చూసే వాడు. పగలు నా నీడని కూర్చుని ఏవో లెక్కలు చేసేవాడు. నోబుల్ ప్రైజ్

ఇచ్చార్డ. ఇండియాలో నోబుల్ ప్రైజ్ పుచ్చుకున్న వాళ్ళలో రెండవవాడు.

ఈ వెధవ్వాన ఇంక తగ్గదు కాబోలు! ఈ మధ్య శ్రీశ్రీ వచ్చాట్ట యూనివర్శిటీకి. కాలేజీలో చెట్టు కులాసాగా వుందా అని అడిగేట్ట. నా నీడనే ఫుట్‌బాల్ ఆడేవాడు కదూ, నాతో మాట్లాడడమే ఓ ఎడ్యుకేషన్ అంటూ కన్యాశుల్కంలోని గిరీశాన్ని ఇమిటేట్ చేస్తూ గంటల తరబడి లెక్చర్లు యిచ్చేవాడు. సిగరెట్టు యిస్తే గేయం చెప్తాననేవాడు. మహాప్రపంచం అంటూ అప్పట్నుంచీ కలలు గంటూ వుండేవాడు. ఎన్ని గేయాలు విన్నాను శ్రీశ్రీవి. ఎంత పొంగిపోయానో నా గురించి శ్రీశ్రీ అడిగేడని తెలియగానే. శ్రీశ్రీయైనా నన్ను గుర్తుంచుకొన్నాడు. ఎంతవాడయ్యాడు? మద్రాసులో ఏం అవస్థలు పడుతున్నాడో. ఈ మధ్య సన్మానం చేసారు స్టేడియంలో: తెన్నేటి విశ్వనాధం అధ్యక్షత వహించాడు. నాకే వడక వస్తే ఎంత బావుణ్ను. స్టేడియం దూరంలో ఉండటం చేత సరిపోయింది. లేకపోతే ఆ మాత్రం చూడలేకపోయే దానిని. ఎగిరెగిరి చూసాను. ఆ విశ్వనాధం ప్రస్తుత యం. పి. విశ్వనాథం అప్పుడప్పుడు కాలేజీకి వస్తుంటాడు. ఓల్డు బాయ్స్ డేకి తప్పక వస్తాడు. వీళ్ళందరినీ తలంచుకొంటూ ఉంటే ఎంత గర్వంగా ఉంటుంది!

పై కొమ్మ విరిగిపోయింది. అబ్బ! నొప్పి. ఇవాళ ఇలా చిత్రవధతో చస్తా కాబోలు! రేపు నేను లేకపోతే కుర్రాళ్ళు ఎలా వుంటారో!

పదేళ్ళయింది కాబోలు హైస్కూలు శత సంవత్సర వార్షికోత్సవం జరిగి.చాల పెద్ద ఎత్తున ఉత్సవాలు జరిగేయి. నా నీడనే కదూ జరిగేయి. చాలా కొమ్మల విరిచేసారు. ఎంతో బాధపడ్డాను. గొడగులా తయారు చేసారు. రంగు రంగుల బల్బులు నాకు హారాల్లా కట్టారు. క్రిం[illegible] చీమల పుట్టలూ అవీ లేకుండా చేసారు కాళ్ళ దగ్గిర పారాణీ రాసినట్టు ఎర్ర[illegible] రంగు వేసారు. అంతకాలం పాతకాలం దానిలా వున్న నన్ను up to date కాలేజీ అమ్మాయిలా చేసారు. కల్ప వృక్షం అంటారు నన్ను, నా పేరే మర్చి పోయాను. కవి సమ్మేళనం జరిగిం[illegible] ఆఖరి రోజున. విశ్వనాధం నా ఎదురుగ కవితా గోష్టిలో పాల్గొన్నప్పుడు ఎం[illegible] ఆనందంగా పొంగిపోయానో. వీళ్ళంద[illegible] గురించి వింటున్నప్పుడు ఎంతో ఆనం దంగా వుంటుంది.

వారం రోజులయింది. కుర్రాళ్ళు నా దగ్గిరికి వచ్చి కాలేజీ ఎప్పుడు తెరుస్తార[illegible] ఈ వెధవ్వాన ఎప్పుడు పోతుందో! శ్రీరంగం రాజేశ్వర రావు కాబోలు నా గురించి ఏదో కధలో రాసాట్ట. పాప[illegible] వెలుగులోకి వస్తున్నవాడు చిన్నప్పుడే చీకట్లో కలిసిపోయాడు.

నా దగ్గరికి కుర్రాళ్ళు వస్తే ఎందుకో

కోపం అందరికి వాళ్ళ మీద. క్లాసు రెగ్గొట్టి చెట్లక్రింద వున్నారని కోపం. క్లాసులో పాపం కూర్చోలేకనే కదా నా దగ్గరికి వస్తున్నారు, వాళ్ళకు అర్థం అయ్యేలా పాఠాలు చెపుతే నా దగ్గిరకు ఎందుకు వస్తారు. క్లాసులో ఏం చెపుతున్నదీ అర్థం కాకపోయినా కూర్చుని తెలీని ప్రశ్నలకు జవాబులు అడిగి, చెప్ప లేని మాష్టర్ల చేత తిట్లు తిని, మరీ రెచ్చగొడితే వాళ్ళని తన్ని ఏడిపిస్తే బావుంటుంద కాబోలు. అయినా క్లాసులో కన్న ఎక్కువ మంది విద్యార్థులు నా దగ్గర ఉంకటం చేత జలసీ కాబోలు మాష్టర్లకి, ప్రిన్సిపాల్ కి! ఆ మాష్టర్లు కూడా ఒకో ప్పుడు ఈ కాలేజీలో చదివి నా నీడని బ్రతికిన వాళ్ళే వెధవ చెట్టు కొట్టించేస్తా' అన్నాట్ట ప్రిన్సిపాల్ ఆ మధ్య. చెట్టు కొట్టడానికి వీలులేదు. తల్లిలాంటిది. కొడితే స్ట్రయికు చేస్తాం అన్నారు విద్యార్థులు నాలో ఏం చూసో వాళ్ళకింత అభిమానం వాళ్ళ నన్నాదుకో పోతే ముక్కలు క్రింద నరికేవారు.

ఈ విద్యార్థుల దగ్గ నుంచి ఎంత జ్ఞానం సంపాదిం ాను. కాని మూగజీవిని. నాకే మనుషుల మాట్లాడే భాష మాట్లాడ గలిగితేనా కాలేజిలో జరుగుతున్న పాపాలు బైట పెట్టేదానిని అమాయకులైన పిల్లలను జైలుకు పంపారు ఆ మధ్య. హిందీ వద్దన్నా స్టీలు ప్లాంటు కావాలన్నా, రెగ్యులేషన్సు మార్చవద్దన్నా ఏ గొడవ వచ్చినా కాలేజీలో పర్మిచరు బద్దలు కొట్టారుగాని ఒక్కళ్ళూ నా మీద చెయ్యి వెయ్యలేదు. ఈ మధ్య కుర్రాళ్ళు ఎక్కువగా రావటం లేదు వచ్చిన వాళ్ళు ఆ నీడన నిలబడి అమ్మాయిల మీద రాళ్ళు. రాకెట్లు విసురుతున్నారు చెట్టు క్రింద మనుషులంటే రికి అంచేతే కోపం కాబోలు. కుర్రాళ్లు పాపం. తప్పుర్రా. అని చెప్పాలని ఉంటుంది. ఎన్ని లక్షల మంది అబ్బాయిలు ఇక్కడ చదివి, నా నీడని ఉండి డాక్టర్లు, ఇంజనీర్లు. ఇంకా ఎంత పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారో పాపం ఈ మధ్య ఉద్యోగాలు దొరకడం లేదట. ఉద్యోగానికి లంచాలు ఇవ్వాలట నా నీడని బ్రదికిన వాళ్లు గొప్ప వాళ్ళయితే సంతోషంగా ఉంటుంది. ఉద్యోగాలు లేక ఆకలితో మాడుస్తూ ఉంటే చాలా బాధగా వుంటుంది. ప్రకృతే యిలా భయపిస్తూ పీడిస్తూ ఉంది మనిషి మరొకడిని పీడిస్తున్నాడు.

అమ్మ బాబోయ్ కొమ్మలన్ని ఎగిరి పోతున్నాయి అబ్బా వేళ్ళు తేలిపోతున్నాయి. పెద్దగాలి అమ్మో . చచ్చి పోతున్నాను కూలి పోతాను కాబోలు. నోరు విడటంలేదు అరుపు వినపట్టం లేదు .అమ్మో య ఎవరూ లేరు రక్షించడానికి . అబ్బా .కూలి పోయాను .. నడుం విరిగిపోయింది . రెండ్రోజుల్లో ఎండి పూర్తిగా చచ్చిపోతాను.

* * *

చెట్టు కూలిందన్న వార్త తుఫానుగాలి కన్న వేగంగా ఊరంతా వ్యాపించింది. వానలోనే తడుస్తూ ఆఖరిసారి చెట్టును చూడ్డానికి వస్తున్నారు విద్యార్థులు, ఊరిలోని జనం. ఎంతో మంది కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నారు హమ్మయ్య అనుకున్నారు ప్రిన్సిపాలు. మాష్టర్లు.

రెండ్రోజులికి వాన పూర్తిగా పోయి ఎండ వచ్చేసింది, ఎండని ఓ నాలుగు రోజుల్లో చెట్టు ఎండి పోయింది. చెట్టు దగ్గిరకి ఎవరూ రావడం మానేసారు. తల చెడిన స్త్రీలా ఉంది బోడిగా అక్కడ. హాస్టల్ మెస్‌లోకి చెట్టుకొట్టించి రవాణా చేసాడు వార్డెను,

అన్నం గంగాళం క్రిందపంచ ఖాతాలోకి కలిసిపోతోంది చెట్టు కాలి పోతూ కూడా తన పిల్లల్లాంటి విద్యార్థులకు వంట చెరుకుగా ఉపయోగ పడటంతో చాలా ఆనందంతో మండి పోతోంది.

• • •

(పై చెట్టు విశాఖపట్నం మిసెస్ ఎ.వి.ఎన్ కళాశాలలో ఉండేది ఈ మధ్యనే కూలిపోయింది.) •

---

కళ్ళజోడు

ఒక పత్రికలో ప్రకటన

మొన్న విజయవాడ—గుంటూరు బస్‌లో కళ్ళజోడు పడిలేశాను. దొరికిన వారు ఈ పత్రికలోనే కాస్త పెద్ద టైపులో ప్రకటించ ప్రార్థన



డాక్టరు కొత్తగా కళ్ళజోడు పెట్టుకున్నాక ఎలా ఉంది?

రోగి ఘోరంసార్! యీ రోడ్డుపైద ఇన్ని బళ్ళేమిటి అదంతా కనిపిస్తూ ఉంటే రోడ్డు దాటట మెలాగో తెలియక మతిపోతోంది.



భారత దేశంలోని ఇద్దరు పుణ్య దంపతులకు మొదటి సారిగా ఇద్దరు-కవల మగ పిల్లలు కలిగారట. వాళ్ళకి పీటర్ రిపీటర్ అని పేరు పెట్టేరు. మళ్ళీ సారి ఇద్దరు కవల పిల్లలు. వాళ్ళని కేటూ డూప్లికేటూ అన్నారు.
ముచ్చటైన మూడోసారి కాన్పులలో కూడా కవలలే. ఈసారి వాళ్ళని మేక్స్—క్లయిమేక్స్ అన్నారు

# పదబంధ ప్రహేళిక శ్రీశ్రీ

## పజిల్ నెం. 5



### అడ్డు

1 ఊపిరి: ఆ సుయోధను ముక్కున—

3. సరదా!

6. గంగ కీద్దరిమే అద్దరి కీడునంగలదె అన్నాడు: ఎటునుంచి చూసినా అదే మాట 26 లాంటిది.

9. తిరగబడ్డ పట్టణం: అంతు లేని విరోధులు.

10 ఆకలికి, అడుక్కుతినే వాడికి.

11. అమ్మలక్కలలో పాండవదహనానికి!

13. కడుగడు, కడువిడు, మిగిలేది తలలేని అద్దె.

15. ఎలాగైనా మా తమ్ముడు మొదలే తల్లి కాగలడు.

16 రామబ్రహ్మం తీసింది. సెన్సారులు కోసింది.

18. జాతీయ గీతంలో అయిదారు అక్షరాలు

19 ఇంగ్లీషు ఓనమాల (వర్ణమాల) లో అక్షరం, విలువ కందని సంఖ్య (తెలుగులో వ్రాయండి ప్లీజ్)

20 తెలుగు దైవం ఉన ట్టా, లేనట్టా?

21 నేటికతడే రేపటి ప్రభువు.

23 వారాలకు రాలలేనిమాట: కావొత్తు కావాలంటారు కొందరు.

25 మరతిప్పితే చాలు లక్ష్మీప్రసన్నం

26 ఇంగ్లీషులో పాలింద్రోమ్ అంటారు కావాలలో ఉండను కుంటారు

28 అమ్మనప్పయ్యా! కాళ్ళపాళ అన్నమయ్య కాదు

29 రజ్జుల తిరుగుబాటు పాడి అక్షరాల కోరిక!

31 కల కతన మారిన పసిడి తీగ

33 పుత్రులు—దశరథునికి నలుగురు, పాండురాజుకి అయిదుగురు

34 ఎవరి తలపులయినా ఇక్కడే ప్రారంభమవుతాయి

## నిలువు

1 విడుపు కలిపితే సెలవు ఇదో క్రీడ

2. కవిగారితోక,తల తర్వాత తలకిందులు: చాంచల్యం

4 కంగారి ఇంటిపేరు ఇంగ్లీషులోవద్దు సంగీతంలో రెండు

5 తినడానికి అమ్మడానికి కత్తి చెయ్యడానికి పనికొస్తుంది

6 బొమ్మలులేవు: ఎంత ఆశ్చర్యం!

7 పదికి ప్రాస కోమటిది బేరం బేగం అంటుంది

8 నాటుకాడు తెలిసినవాడు

12 కంచుకం తిరగెయ్యి ఒక రైతులో దాచు

14 భూమి, భూమిలోంచి, అప్పుడప్పుడు ఒంటిమీద

15 మనిషి!

17 తురక భాష అవ్వేదెప్పుడు?

18 దీన్ని నింపడానికి ఇది కూడదు

21 సగం పొరుగు

22 ఆదికి అంతం మధ్యకి మొదలు మనస్సు తిరగ బడింది

23 పొట్టి తనం (దాశరథి గాడిదా?)

24 మాకూ మాకూ ఉన్నది మనిషికి మ పికి ఉండాలి,

27 హికమద్దారు నెత్తిమీద నేత్తిలేని మంచు

28 పూలతో, రత్నాలతో కూర్చేని

30 కొందరు కవులెలాగ గొప్పవారవుతారు?

32, రాత్రి వస్తుంది పగలు రావచ్చు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 అ | | 2 నా | | 3 జ | | |
| | 4 ధ | న | 5 మ | | | 6 గ | 7 తి | |
| 8 వి | ప్ల | వ | ర | చ | 9 యి | త | ల | పై |
| | | 10 స | దా | | 11 వా | ల | కం | |
| 12 త్న | | ర | | 13 గా | | ప్ర | | 14 టే |
| | 15 క | ప్ర | 16 ము | | 17 సం | తా | | |
| 18 స | మ | సం | ఘ | సం | స్థా | ప | 19 న | లో |
| | 20 లం | గా | | | 21 నం | క | న | |
| | | లు | | 22 శ్రీ | | ఉ | | |

# 4 నం క్రాస్వర్డు పజిల్ మీద శ్రీ శ్రీ రిపోర్టు

పత్రిక ఆలస్యంగా విడుదల కావడం వల్లనూ పజిల్ కాస్త కఠినంగా వుండడం వల్లనూ ఒకే ఒక ఆల్ కరెక్టు సమాధానం వచ్చింది అది రామలక్ష్మి ఆరుద్రగారి పేరిట, ఆరుద్ర దస్తూరీతో

ఇద్దరినీ అభినందిస్తున్నాను

భట్టారం ఉదయినిగారు 12 13 ఏకాక్షర పదాలు ప్రాణాంతకంగానే ఉన్నాయి అని రాసేరు మిగిలిందంతా కరెక్ట్ ఆవిడను Also Ran గా అభినందిస్తున్నాను

పజిల్ను ఎట్టి పరిస్థితుల్లోనూ ఆప వద్దని ఆరుద్ర మా ఎడిటర్గారికి సలహా ఇచ్చారట వేలాది పాఠకులకు ఉత్తేజం ఇస్తూన్న దీన్ని ఆపే ఉద్దేశం నాక్కూడా లేదు అందరికీ నా కృతజ్ఞత అయితే పత్రిక సకాలానికి రాకపోవడం (కారణాలే వయితేనేం?) బాధాకరంగా ఉంది పరిస్థితులు కుదుటపడే దాకా ఇక టైం లిమిట్ లేదు వచ్చే సంచిక వెలువడే లోగా ఎప్పుడైనా సమాధానం పంపవచ్చు

# జోక్ బాక్స్

తెల్లటి ఇస్త్రీ సూటు వేసుకొన్న వో స్ఫురద్రూపి—రైలెక్కుదామని వచ్చి ఎ పెట్టెలోనూ ఖాళీ లేకపోతే చివరికి ఒ పెట్టి దగ్గర నంచుని "ఈ పెట్టెలో వాళ్ళంతా దిగిపోయి వేరే పెట్టెలోకి వెళ్ళిపోండి ఇదిక్కడ దిగబడిపోతుంది ' అన్నాడు

ప్రయాణీకులంతా కంగారుపడి దిగిపోయి వేరే పెట్టెల్లో సర్దుకున్నారు అప్పుడు ఆ ఆసామీ దర్జాగా అందులో యెక్కి బిచాణా పరిచి హాయిగా పడుకొన్నాడు

ఘంటసేపటికీ రైలు కదలకపోవడం చూసి ఇవతలికొచ్చి స్టేషన్‌మాస్టర్ అలా వెళ్తూ వుంటే రైలు ఇంకా ఎంత లేటు?! అనడిగేడు

రైలు లేటు లేదండి ఇందాక ఎవరో ఆఫీసరుగారు ఈ పెట్టె తలకి చేసి ఇక్కడ దిగడిపోవాలని ఆర్డర్స్ వేసేరు అందుకని డిస్‌కనెక్ట్ చేయించేశాం రైలెళ్ళి పోయి చాలా సేపయింది అన్నాడు స్టేషన్ మాస్టరు



శ్రీమతి 'ఏమండోయ్ శ్రీవారూ!' పాట పాడనా?

శ్రీవారు వద్దు నాకా పాట చిరాకు!

శ్రీమతి పోనీ పాడ వేల రాధికా?' పాడనా??

శ్రీవారు వద్దు నాకాపాట యిష్టం



పక్కింటాయనతో ఆఖరిసారి చెబుతున్నా-వెంటనే మీ అమ్మాయి చేత ఆ హార్మనీ పాట ఆపించకపోతే నాకు పిచ్చెక్కి పోతుంది "

పక్కింటాయన ' హార్మనీ నిన్నరాత్రే అమ్మేశా అమ్మాయి తెల్లారే వాళ తాతగారి వూరెళ్ళింది "




ఇది నా కోడలు.

చెప్పకుంటే సిగ్గుచేటు. అయినా ఇది నా కోడలే! నేనే కావాలనికోరి నా కొడుక్కి చేసుకొన్న సుగుణాలరాశి. అంచేత ఇప్పుడు నా మీదే ఎక్కి స్వారి చేస్తోంది. గంగిరెద్దుని ఆడించినట్లు ఆడి స్తోంది. పోనీలేగదా చిన్న తనమని సర్దుకు పోతూంటే మరీ హద్దు మీరి పోతోంది. అసలు నన్ను లెక్క చెయ్యడమే మానే సింది. ఎందుకూ పనికిరాని ఓ ముసల్దా

నిగా చూస్తోంది చూస్తుంది, చూడకేం చేస్తుంది? ఖచ్చితంగా చూస్తుంది దానికి నేనిచ్చిన అలుసలాంటది చెంపలు పగిలేట్లు కొట్టకొని చేసినప్పుడు పశ్చాత్తాప పడితే మాత్రం ఏం లాభం? ఏమీ లాభం లేదు వీసం యెత్తుకూడా లాభం లేదు అబ్బో అదేమంటే నా భూమ్మీద ఆగేట్లుందా? ఇల్లంతా తనదిగా చేసుకొని ఏలేస్తోంది వాడో పిచ్చి వెధవ అంట్ల వెధవలా తయారయ్యాడు పెళ్ళయిన పావుగంటకే పెళ్ళానికి దాసోహమనేశాడు దాన్చేతులో కీలుబొమ్మయి పోయాడు పిల్లల చేతిలో దసరా ఆంజనేయులు బొమ్మలాగా ఆదెటు లాగితే అటు ఎగురుతున్నాడు అంతే! అవునుమరి! ఇన్నాళ్ళూ పెంచి పెద్ద చేసింది వీడ్నలా పెళ్ళానికి ధారాదత్తం చేసేయడానికే ఈ తల్లులందరికీ తెలిస్చావదు తెలీక "నా కొడుకో!" అంటూ ప్రాణమిస్తారు ఎప్పటికయినా తమల్ని చూసేది వాడేనని నెత్తినెట్టు కొంటారు ఈ వెధవాయిలేమో పెళ్ళాం రాగానే దాని కొంగునే మూలో దాక్కొని తల్లి నెత్తి కొడతానికి వస్తారు వస్తారేమిటి? మొన్న నాలుగో ఇంటి సీతాపతిగాడు రానే వచ్చాడు అక్షరాలా తల్లిని చావబాదాడు బాదాలి కూడానూ! అప్పుడుగాని ఈ తల్లికి బుద్ధిరాదు లేపోతే ఏమిటి? కొడుకుని ఓ మహారాజులానూ, కూతుళ్ళను తమ సంసారం గుల్లచేసి పారేసే సాధనాలుగా చూసి, వాడి ముందు వీళ్ళను దాసీ వాళ్ళల్లా పెంచి-ఎందుకు పెద్ద చేయాలి? అంచేత వాళ్ళకూ బుద్ధి చెప్పాల్సిందే! అలాంటి తల్లులని ఆ ముద్దు కొడుకులు పాతేసినా జాలి తలువ కూడదు ఇలాంటి గుణపాఠాలెన్నో జరిగితేగాని ఈ తల్లి జాతి మారదు ఆ కోడలు పిల్లమాత్రం? పెళ్ళి చూపుల కెళ్ళినపుడు ఎంత వినయ విధేయతలు నటించిందనీ? బాబోయ్! తల్చుకొంటే గుండెలు పగిలిపోతున్నయి ఏమయినా—సంబంధం ఉంటూ? అప్పటికీ ఇప్పటికీ, బరితెగించి పోయింది! ఇక దాన్నెవ్వడూ అదుపులో పెట్టలేడు అదుపులో ఉంచాల్సినోడే దాని గుప్పిట్లో చీములా తిరుగుతున్నాడు ఇంకా ఎవరెన్ని చెప్తే, చేస్తే మాత్రం ఏం లాభం?

పెళ్ళయి కాపరానికొచ్చిన ఓ నెల్లో జులు సరిగ్గా ఉందేమో! నేను చెప్పినట్లు వింది చెయ్యమన్నట్లు చేసింది నాతో మల్లెపూల జడ వేయించుకొనేది పైట నిండుగా కప్పుకొనేది బాడీ వేసుకొనేది కాళ్ళకు పసుపు రాసుకొనేది ప్రొద్దున్నే అయిదింటికి నిద్ర లేచేది అన్నిటికీ నా సలహా అడిగేది ఏం కావాలన్నా నన్నడగందే కొనేదికాదు మా వగారంటే భయమూ భక్తీ ఉండేది ఆయనెదుటనే వెళ్ళేది కాదు పరాయి మొగాళ్ళతో అసలు మాట్లాడేది కాదు అందాకా ఎందుకూ? మావగారికి మందిమ్మంటేనే "ఆయనెదుటకి వెళడానికి సిగ్గు బాబోయ్," అంటూ సిగ్గు పడేది వీధిలోకి తొంగి కూడా

చూసేద కాదు పొరుగిళ్ళకు వెళ్ళేదే కాదు వాడు! ఆ అంట్ల వెధవ మాత్రం? ఎట్లా ఉండేవాడని? చిన్నప్పటినుంచి ఒక్క రోజయినా నన్నొదిలి ఉన్నాడా? నేను ప్రక్కన లేందే భోజనం చేశేడా? నేను జోకొట్టందే నిద్ర పోయేవాడా? చిల్లర డబ్బులు కావల్సొచ్చినప్పుడల్లా నన్నడిగి తీసుకోలే? ఏ కొంచెం తలనొప్పి వచ్చినా 'అమ్మా' అంటూ నాతో అమృతాంజనం రాయించుకోలే? రాత్రిళ్ళు పదింటి వరకూ వెన్నెల్లో నా ప్రక్కలో కూర్చొని కథలు చెప్పమని ప్రాణం తీయలే? అందాకా ఎందుకూ? వాడు థర్డ్‌ఫారం చదువుతోన్న పుడేమయిందీ? క్లాసు వాళ్ళందరూ పిక్ నిక్ కి పోతూంటే నేనూ పోతానని తయారయి తీరా ఆ రోజు వచ్చేసరికి మా అమ్మ లేందే నేను రానని ఏడ్చెయ్యలే? ఉద్యోగంలో చేరిన మొదట్లో జీతం అంతా తెచ్చి నా చేతుల్లో పొయ్యలే? అన్నీ చేశాడు అయినా అదొచ్చేసరికి ఊసర వెల్లిలా రంగు మార్చేశాడు, అయ్యో! మార్చటం కూడా ఎట్లా? అసలా రంగుకీ ఈ రంగుకీ సంబంధమేలేదు పూర్తిగా మరో జన్మ ఎత్తినట్లే మారిపోయాడు అదికాపరానికొచ్చిన మర్నాటి నుంచి ఆ గదిలో నుంచి బయటకు రావడమే మానేశాడు నాతో ఆదివారం మాట్లాడ్డమే మానేశాడు ఎప్పుడూ-దానితో మాటలే!ఎప్పుడూ ఇద్దరూ వికవికలూ - పకపకలే! నేనూ కాపరం చేశాను కాని ఏనాడూ ఇంత విరగబడి పోలేదు అదొచ్చిన రెండో రోజునే 'నేనూ శాంతా కలసి భోజనం చేస్తాములే అమ్మా! ముందు మీరు తినెయ్యండి!'' అంటూ వడ్డించిన భోజనం చేయకుండానే గదిలో కెళ్ళిపోయాడు రాత్రి ఎప్పటికో ఇద్దరూ గంటసేపు కబురాడుతూ భోజనం చేశారు అది ప్రక్కనుంటే భోజనం అమృతమయి పోతుందా నేనుంటే విషమయి పోతుందా? కాఫీ మాత్రం? ఓ లోజు వంట్లో బావుండక దానితో కాఫీ చేయించాను అంతే! ఆ రోజు నుంచీ ''నువ్వే కాఫీ కాస్తూండు? అద్భుతంగా ఉన్నది అంటాడా? అన్నేళ్ళుగానే చేస్తున్న కాఫి ఎందుకూ పనికిరాని చూరు నీళ్ళల్లా అయిపోయినయ్యా? వాడే కాదు ఆయన? నాతో ఇన్నేళ్ళు కాపరం చేసిన ఆ ముసలాడు (వళ్ళు మండిపోతోంది మరి) కూడా కొడుక్కి వంత పాట పాడుతోండె! అది చేసిన కాఫీ అద్భుతంట! ఆ రోజు అది వండిన వంట అమోఘంట, అది నూరిన కంది పచ్చడి సూపర్బ్‌ట ఎలా పొగిడారనీ? నే వింటున్నానని సిగ్గు లేకుండా నోటి కొచ్చినట్లు మెచ్చుకొంటున్నారు నే కాపరానికొచ్చిన క్రొత్తలో ఆ నోటితోనేగా నేనో దేవతననీ, నే చేసే వంట పంచామృతం అనీ, అందీ? అది మర్చేపోయారు ఇప్పుడేమో ప్రతిదానికీ కోడలు కావాలి? నిన్నగాక మొన్న వచ్చిన కోడలు బంగారవయిపోయింది, రోజూ నేను మందు ఇస్తే

# దీన్ని నా స్వంత డబ్బుతోనే కొనుక్కున్నాను!



మీకు కూడా మీ స్వంత డబ్బుతో చక్కని వస్తువులను కొనుక్కొని ఆనందించాలని లేదూ ?
సమీపంలోవున్న ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకులో ఒక మైనర్ సేవింగ్స్ అక్కౌంట్
ప్రారంభించండి మీకు ధనరూపంలో దొరుకుతూన్న కానుకల్ని ఖర్చు
చేసేయకుండా మీ స్వంత బ్యాంక్ అక్కౌంట్‌లోజమ కట్టండి మీ ఆదాలు
రోజు రోజుకీ పెరుగుతూండడం గమనించండి

అఖరికి ఒకరోజున-మీ ఖాతాలో చాలా డబ్బు పోగవుతుంది, అదంతా మీ స్వంతమే!

ఐఓబి—మీతో మెలగగలిగేటంత చిన్నది ఎంత సేవయినా
చేయగలిగేటంత పెద్దది

## ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్

సెంట్రల్ ఆఫీసు 151 మౌంటు రోడ్డు, మద్రాసు 2 IOB-6121

అరగంట గొడవచేసి, ఒహోరోజు ఆగ కుండానే ఊరుకొనే వాళ్ళు. ఇప్పుడేమో కోడలు పిల్ల తీసుకెళ్ళ స్తే కిక్కురు మన కుండా మింగుతున్నారు.

నెలొచ్చేసరికి పెన్షనంతా పేకాటలో తగలేసి వచ్చేవాళ్ళు, దమ్మిడీ అడిగినా ఇచ్చేవాళ్ళు కాదు. యిప్పుడేమో కుక్కిన పేనులా కోడల్చేతిలో పైసల్తో సహా అప్పజెప్తున్నారు. ఏం? నేనంటే అంత లెక్కలేని తనమా? ఆదంటే భయమా. తక్తీనా? వాడూ అంతే! జీతం అంతా తెచ్చి దాన్చేతిలో పోసి దాసోహం అంటు న్నాడు. ఏ రోజు ఖర్చుకి సిగ్గులేకుండా దాన్ని దేవురించి తీసుకెళ్ళాల్సిందే గదా. అదే నంటే నేను దుభారా మనిషి నట. ఉప్పు వాడ కట్టందరికీ అప్పులిచ్చి పంచే స్తున్నానంట! నాకేమీ తెలీదట. చేత కాదట. యిరవై ఆరేళ్ళ పెంచి పెద్ద జేసి నందుకు ఇవీ వీడు నాకు ప్రసాదించిన బిరుదులు ఓ రోజు తల్నొప్పి వచ్చిందని దాని వళ్ళో తల పెట్టుకు పడుకొన్నాడే గానిమాట మాత్రమయినానాతోచెప్పడంలా అదేమో మొద్దులా తెల్లార్లూ ఊరుకొని తొద్దున్న చెపుతోంది. సినిమాలేం తక్కువా? నెలొచ్చేసరికి రెండు సినిమా లకి ఊరేగుతున్నారు! సినిమా కెళ్ళాలనే సరికి అదెలా తయారవు తుందనీ? ఓ షోకా? ఫాషనా? అబ్బో! ఈ రోజు సినిమా కెళ్ళాలంటే వారం రోజులు ముందు నుంచే తయారవడం మొదలెడుతుంది. నేవేసే మల్లెపూల జడ ఫాషన్ కాదట. రెండు జడలు వదులుగా వేసుకొనేది. ఆ జాకెట్టు? అవ్వ! సిగ్గుచేటు. నేను జూసి వీపంతా చిరిగి పోయిందేమో అను కొన్నాను. అదే, పైకంటే ఎలా నవ్విం దని విరగబడి! కాదంట! ఫాషనంట! వెనుక సగంవీపు కనబడటం ఫాషనా? చీరేమో బొడ్డు క్రింది దాకా దిగలాగి కట్టింది. అదేమిటంటే అదంతేనట! ఆ అంట్ల వెధవ కూడా "అదంతేలే వే!నువ్వూ రుకో!" అంటాడేమిటో? ఇదేమయినా బోగం కొంపా? మరేవిటా బోగం వేషాలూ? ఆ మాటంటే నామీదే విరుచుకు పడ్డాడు. అవతల అది చేసే పన్లు బాగానే వున్నాయి. నచ్చ జెప్పటం పాపమయి పోయింది. "యింకోసారి దాని విష యంలో నువ్వసలు జోక్యం కల్పించు కోకు, అదేం చిన్న పాపాయి కాదు. దాని మంచి చెడ్డలు దానికి తెలుసు!" అంటూ పోట్లాడినంత పని చేశాడు.

అదెంత టెక్కుల మారి అనీ! నాల్రో జులు కాస్తంత నలతగా ఉంటే అసలిక వంటింట్లోనే రావద్దంటూ వంట తనే చేయటం మొదలుపెట్టింది. అదేవిటంటే నేను రెస్ట్ తీసుకోవాలని డాక్టర్ చెప్పా డుట. ఈ వేషాలన్నీ ఇట్టే కనిపెడతాను. అసల్సంగతి నాకు తెలుసు. అది నామీద ప్రేమ కాదు, ఆ వెధవకి అది వండితేనే తినాలనుంది. పైకి చెప్పడు. నా ఆరో గ్యం మీద వంక. ఇవన్నీ—ఈ చేష్ట

లన్నీ చూస్తుంటే అసహ్యం కలుగుతోంది. రోత పుడుతోంది. ఈ యిల్లొదిలి ఎటేనా పోవాలనుంది పెద్ద కూతురు రమ్మని ఉత్తరాలు వ్రాస్తోనే ఉంది. వెళ్తే నెత్తిన బెట్టుకుంటుంది వెళ్తేసరి. లేపోతే ఏమిటి? గౌరవం లేని చోట నే ఎందుకుండాలి? సావిత్రమ్మ అందుగ్గాదూ—కూతురి దగ్గరి కెళ్ళిపోయింది? కొడుకేదో చిన్న మాట అన్నాడని రోషం వచ్చి బట్టల్సర్దుకొని వెళ్తున్నాననయినా చెప్పకుండా కూతుర్దగ్గ రికి చక్కా పోయింది. అంతే! మళ్లీ రాలేదు. తరువాత అతగాడెళ్ళి బ్రతిమాలినా రాను పొమ్మందిట, అయినా నా పిచ్చిగాని ప్రపంచంలోని కోడళ్ళంతా ఇలానే ఉంటారా? చివరింటి రాధమ్మ కోడలు చూడరాదూ? రోజూ ఆవిడ పనిమాలా వచ్చి తన కోడలు గురించి ఆనందంగా, గొప్పగా చెప్పి మురిసిపోతుంటుంది. ఆవిడ సలహా లేందే జడ కూడా వేసుకోదట. ఉదయాన్నే లేచి అత్తగారి కాళ్ళు కళ్ళ కద్దుకొని గానీ రెండో పని చేయదంట. రాత్రిళ్ళు అత్తగారు నిద్రపోయేవరకూ కాళ్ళు పట్టిగాని తను నిద్రపోదుట అత్త గారికి కాస్త నలతగా ఉంటే చాలు విల విల్లాడిపోయి కూడూ నీళ్ళూ లేకుండా దగ్గర కళ్ళల్లో వత్తులేసుక్కూచుని పరి చర్యలు చేస్తుందట. కొడుక్కి కూడా తల్లంటే వల్లమాలిన భక్తి అట. పెళ్ళాంతో కొరడాతో కొట్టినట్లు మాట్లాడతాడట. తల్లి చెప్పిన పని చెయ్యకపోతే, పెళ్ళాన్ని కొడ తానికని ఓ కొరడా కొనుక్కొచ్చి హాల్లో గోడకు తగిలించి ఉంచాడట. ఈ మాట సావిత్రమ్మ చెప్తున్నప్పుడల్లా ఎంత ముచ్చ టగా, ఆనందంగా ఉంటుందని. అలాంటి కొరడా ప్రతి కొడుకూ కొనిపెడితే ఈ కోడలు పిల్లలు ఇలా ఎదురు తిరగ్గలరా? నువ్వెంతంటే నువ్వెంతని మాట్లాడ గలరా? ఇంతకూ రాధమ్మ అదృష్టవంతు రాలు. మొదట్నుంచీ తనెలాంటి కోడలు కావాలనుకొంటూ వచ్చిందో అలాంటి కోడలే దొరికింది. దేనికయినా పెట్టి పుట్టాలి. మాటల్లో రాధమ్మ వస్తూనే ఉంది.

"రావమ్మా రాధమ్మా! ఇది విన్నావా? ఇటు కూర్చో ముందు. మా కోడలు... ఆవిడని నేనాజ్ఞాపించగూడదట. ఆవిడ కిష్టమయిన పనులు చేసే అధికారం ఆవిడ కున్నదట నేనసలు జోక్యం కలుగజేసుకో కూడదట. కృష్ణా రామా అనుకొంటూ మూల కూర్చోవాలిట. అవునూ! నాకు తెలీకడుగుతాను, నలభై అయిదేళ్ళకే మనకి మతులు పోతయ్యా? మంచీ చెడ్డల చూసే తెలివి లేకుండా పోతుందా? మన కంటె వీళ్ళకెక్కువ తెలుసా? వాడు నా కొడుకు సంగతి! ఖర్మ! చెప్పకుంటే సిగ్గుచేటు. వాడే ఇవన్నీ నాతో చెప్త! అ లేనిపోనివి కల్పించి చెప్పకపోతే వాడెం దుకు నామీద ఎగిరి పడతాడు? వాడ్ని కొంగున ముడేసుకొని, అన్నీ నేర్పి న మీదే యుద్ధానికి పంపుతుందా? తప్పు దా కాదమ్మా!" దాన్నేమీ అనను నేను. అం

ఈ వెధవది. అందరు కొడుకులూ ఇలానే పెళ్ళాం వెనుక కుక్కలా తోకాడించు కొంటూ తిరుగుతున్నారా? కని పెంచిన తల్లినే చూపి 'బౌ' మంటాడూ? మీ అబ్బాయీ ఇలానే ఉన్నాడా? వాడుమాత్రం పెళ్ళి చేసుకోలేదూ? పెళ్ళాన్ని ఏలుకోటం లేదూ? మహారాజులా ఏలుకొంటున్నాడు అవునా? అయినా నెత్తినెక్కించుకోకుండా ఎట్లా ఉంచాలో అట్లా ఉంచాడు నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నాడు అవునా? ఎందుకమ్మా? కన్నీళెందుకూ? నా పరిస్థితి చూస్తే ఏడుపొస్తోందా? కాదా? మరెం దుకూ ఏడుపు? ఏమిటీ? నీ కొడుకు మంచాడు కాదా? కోడలు అలా కనబడు తుందిగాని రాక్షసా? కొరడా పెట్టి నిన్ను కొట్టబోయాడా? ఇద్దరూ కలిపి నినింట్లోంచి పొమ్మన్నారా? సాయంత్రం బండికి వెళ్ళి పోతున్నావా? అదేమిటి? మొన్నటివరకూ కోడలి గురించి మరలా చెప్పావేం? అన్నీ అబద్ధాలు చెప్పావ? మొదట్నుంచీ ఓ పనిమనిషిలా చూశారా? అంట్లు తోమించి, ఇళ్ళు ఊడిపించి, బట్టలు ఉతి కించి ,అయ్యో దేముడో! అవన్నీ కడుపులో ఉంచుకొని నా దగ్గర 'మా కోడలు బంగా రం, వెండి' అంటూ కబుర్లు చెప్పేవ్! బండికి టైమయిందా! వెళ్ళిరా మరి! వెళ్ళి రామ్మా! '' అయ్యో! ఇదేమిటిలా అయింది ఆ లెక్కకొస్తే నా కోడలు అలా ఎప్పుడూ చేయలేదే? పనిమనిషి రాని రోజు కూడా నన్ను అంట్లు తోమనీ లేదే? వంట చేయనం కూడా నాకు శ్రమని పొయ్యి దగ్గరకు రానీదం లేదే? ఫించ నంతా పేకాటలో ఆర్పేసే ఆయనగారిని ఓ దోవకు తీసుకువచ్చింది వాడు స్నేహి తులకనీ సినిమాలకనీ, సిగరెట్లకనీ చేసే పిచ్చి ఖర్చులు తగ్గించేసింది. మార్కెట్టుకి ఆ ఆఫీసు ప్యూనుని పంపకుండా తనే పోయి అన్నీ తీసుకొస్తోంది ఆయనకూ, నాకూ వేళకు భోజనం, మందూ అన్నీ అమరుస్తోంది చుట్టు ప్రక్కలాళ్ళందరికీ అప్పు లిస్తోన్నాననీ నాకు డబ్బు అంద కుండా చేసింది ఇందులో దాని స్వార్థం ఏమీ లేదు ఇలాంటి పిల్లను గురించి ఎంత నీచంగా ఆలోచించానూ? ఎన్ని నిందలు వేశానూ? ఆ పిల్లంటే ఎందుకింత కక్ష ఏర్పడిపోయింది? కేవలం రాధమ్మ తన కోడలు గురించి చెప్పిన అబద్దాలు వినడం వల్ల అయుంటుంది అవును రాధమ్మ తన కోడలునుంచి తనకి లభించని ఆదరణ. ఆప్యాయతలను కట్టుకథల రూపంలో అనుభవించి, అందరకూ ప్రచారం చేస్తోంటే నేను నా కోడలిని ఆ కథల్లోని కోడలితో పోల్చి చూసుకొని పిచ్చి పిచ్చి ఆలోచనలతో సతమతమవుతున్నాను

''అత్తయ్యా! భోజనానికి ఇంకా రాలే దేమిటి? పెందలాడే భోజనం చేసేయమని చెప్పానుగదా! ఈ వయసులో కూడా వేళకు తినకపోతే ఎలా? గట్టిగా చెప్తే నేమో నేను మీకు చెడ్డదాన్నయిపోతాను ''

''పిల్లా ఈ ముసల్దంటే ఎందుకే ఇంత ఆపేక్ష! నువ్వే ఇంటి దీపానివి తల్లీ! అప్పు డప్పుడు నీ కాంతి భరించలేక ఏమేమో అనుకుంటూంటాను పాపిష్ఠిదాన్ని. నీ మనసుకూడా నొప్పిస్తుంటాను నన్ను క్షమిస్తావామ్మా?...'' ●

# రుజువు పరచండి

ఈ ఆశ్చర్యకరమైన పరీక్ష చేయండి







## సూపర్ సర్ఫ్ తో
## ఒక్కసారి ఉతికితే
## ఇంకే ఇతర పౌడరుతో
## ఉతికిన దానికన్నా
## ఎక్కువ తెల్లదనం వస్తుంది




**సూపర్ సర్ఫ్**

**అన్నిటికంటె అమిత తెల్లగా ఉతుకుతుంది**

హిందుస్థాన్ లీవర్ వారి శ్రేష్ఠ ఉత్పత్తి




రంగారావు విస్కీ పుచ్చుకున్నాడు గొంతులో మంటగా ఉన్నా, కడుపులో వేడి లేస్తున్నా ఒళ్ళు మాత్రం కులాసాగా ఉంది బరువుగా నడిచి వెళ్ళి కిటికీ సర్రున లాగి బైటకి చూశాడు మధ్యాహ్నం మూడు గంటలే అయినా చీకటిగా ఉంది చలిగా ఉంది తేమ గాలి రంయ్ రంయ్ మని వీస్తోంది ఆకాశం మీద నల్లటి నీటి మేఘాలు చిక్కగా అల్లుకుంటూ గుడగుడ మంటున్నాయి గాలి వాన వచ్చే వాతావరణం ఉండుండి చిన్న జల్లు కొట్టి ఆగిపోతోంది గాలి మాత్రం ఉధృతంగా ఉంది గాలి ధాటికి తాటి చెట్లు పిరికిగా ఊగిసలాడుతున్నాయి ఏక్షణాన్నయినా ఫటుక్కున విరిగిన దభాలున నేలకి కూలిపోయేటట్టుగా వున్నాయి

బీచి రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. సముద్రం అల్లకల్లోలంగా ఉంది అలలు

ఉవ్వెత్తుగా లేచి విరిగి పడుతున్నాయి

రంగారావు మత్తు కళ్ళతో బయట వాతావరణాన్ని చూస్తున్నాడు రోడ్డు మీద కుష్టురోగి కుంటూకుంటూ తిరిగి జల్లుకొట్టే లోపుగా ఎప్పుడైనా తలదాచుకోడానికి పరుగెత్తుతున్నాడు రోడ్డు పొడవునా మేడలు, భవంతులు వాటి క్రింద తల దాచుకోడానికి దరిద్రులకు, అన్నార్తులకు అర్హత లేదు కుష్టురోగి భవంతులకు మధ్యగా ఉన్న పూరి గుడిసెలవైపు పరుగెత్తాడు కనీసం ఎక్కడైనా కూలిపోయిన పూరి గుడిసె పంచలో తలదాచుకోడానికి

భవంతుల మధ్యలో పూరి గుడిసెలు ఉండటం అసహ్యమనిపించింది రంగారావుకి ఆ గాలిలో, ముసురులో తడిసి ముద్దయిపోయి వణుకుతున్న రోగిష్ఠి ముష్టివాళ్ళలా ఉన్నాయి ఆ పాకలు పచ్చటి మేడల వైపు దీనంగా చూస్తున్నాయి ఈ పాడు గుడిసెలు మూలాన వీధి డీసెన్సీ పోయిందని బాధపడ్డాడు గాలి హెచ్చయి వాటిని ఎగరగొట్టేస్తే బాగుండుననిపించింది ఆ పాకల్ని ఇంకా పీకించెయ్యనందుకు మునిసిపాలిటీ వాళ్ళ మీద కోపంకూడా వచ్చింది

ఎక్కడో కుక్క 'బౌ వౌ' మంది రంగారావు అటువైపు చూశాడు వీధిలో కుక్క దేనితోనో చెలగటలాడుతోంది అది ఊర కుక్క దాన్ని చూడగానే రంగారావుకి ఒళ్ళు మండింది అసహ్యంగా ముఖం చిట్లించుకుంటూ సర్రున కిటికీ కర్టను మూసేసి పెళ్ళాన్ని కేకేశాడు

'ఏమిటండీ!''

"రాజా ఎక్కడ?''

ఇంకా ఇంట్లోనే ఉన్నాడనుకుంటున్నారా రెండు గంటలకే కుక్కతో వీధికి ఎకారెళ్ళాడు' అంటూ చలికి పైట నిండా కప్పుకుంటూ ఎదురుగా కుర్చీలో కూర్చుంది

నీకు మతీ గతీ ఉందా లేదా? ఈ రోజ్జగాలిలో వీధికి వెళ్తుంటే చూస్తూ ఊరుకున్నావా? '

అయ్యో! నేనేం చెయ్యనండి చెప్ప చెప్ప నా నోరు పడిపోయింది ఇప్పుడే వచ్చేస్తానని కుక్కతో వీధికి పరుగెత్తాడు ''

పరుగెత్తుతాడు! పరుగెత్తుతాడు ముద్దు చేస్తే నెత్తికెక్కి కూర్చుంటున్నాడు వీడికి ఆ కుక్క ఒకటి దొరికింది చూసి చూసి దాన్నొకరోజు కాల్చి పారేస్తాను పీడా విరగడైపోతుంది దాన్ని పట్టుకొని వీడికి చదువూ సంధ్యా తిండీ తిప్పల మీద కూడా ధ్యాస లేకుండా పోతోంది అని చిందులు తొక్కుతూ గదిలో పచారు చెయ్యడం మొదలెట్టాడు

పోనిద్దురూ - మీరు మరిన్నూ చిన్నవాడు కొన్నాళ్ళు పోతే వాడే మానేస్తాడు వాడికి ఆ కుక్కంటే ఎంత ఇష్టమో!'

'ఆదే ఒద్దంటున్నాను ఇరవై నాలుగు గంటలూ ఆ పాడు కుక్కేనా? అసలు నిన్ను అనాలి నిన్నూ దాన్ని వాడు ఏ




పెంటమీది నుంచి తెచ్చినపుడే అన్నాను అది ఊర కుక్క, దాన్నెక్కడైనా ఒదిలియ్యించమని విన్నావా? ' షోసీ, చిన్నవాడు, చిట్టివాడు, చంటివాడు కుక్క పిల్లతో ఆడుకుంటున్నాడని'' ముద్దు చేశావు ఇప్పుడు అనుభవించు దాన్ని విడిచిపెట్టటంలేదు మంచి కుక్కయితే షోసీ ఫరవాలేదు పాడు ఊర కుక్క చెవులు నిక్కపొడుచుకుంటూ అసహ్యంగా ఛీ! ఛీ! మొన్న తల తీసేసినంత పని అయింది'' అంటూ సోఫాలో చిరాగ్గా కూర్చొని ఎదటి స్టూలు మీద సిగరెట్టు పెట్టి తీసి సిగరెట్టు నోట్లో పెట్టుకొని అగ్గి పెట్టె కొట్టాడు. వెలగలేదు పుల్లని విరిచిపారేసి మరో పుల్ల కొట్టాడు చిరాకుతో వెనక్కి తిప్పి కొట్టాడు, ఎలా వెలుగుతుంది? 'ఛీ! ఛీ!' అంటూ నేల కేసి కొట్టాడు అగ్గిపెట్టెమీద చిరాకు చూపిస్తున్నా అది ఇండైరెక్టుగా తన కొడుకు మీద అసహ్యమనిపించి, అంత

కంటే తన కొడుకు పెంచుతున్న కుక్క మీద కోపం అనిపిస్తే సరోజ గమనించింది.

"ఏం జరిగిందండీ! ఎందుకలా చింపుకు పోతున్నారూ?"

"ఏం జరిగిందా? చెప్తాను విను నీ సుపుత్రుడి సంగతి మొన్నటూ క్లబ్బు ప్రెసిడెంటుగారింట్లో పార్టీ జరుతుంటే వీడూ వచ్చాడు. వీడొక్కడేనా? తగుదునమ్మా అని కుక్కని వెంటతీసుకొని మరీ వచ్చాడు, ప్రెసిడెంటుగారు వీడిని వీడి కుక్కని చూసి ముసి ముసి నవ్వులు నవ్వుతూ, ఒక బిస్కత్తు ముక్క కుక్క మీదకి విసురుతూ ఏంటోయ్! దొరా! ఎక్కడనుంచి తెచ్చావ్ ఈ సీమకుక్కని అని అన్నారు. ఎంత హేళనగా ఉన్నా యనుకొన్నావ్ ఆ ముసి ముసి నవ్వులు దానికి తోడు మిసెస్ రాజారావు కూడా తన ఒళ్లో బొచ్చుకుక్కని నిమురుతూ ప్రెసిడెంటుగారి విట్టు మీద ఒక్కటే నవ్వు....ఛీ! ఛీ! నా కెంత నామోషీ అనిపించిందో తెలుసా. అంతటితో అయిపోయిందా. ప్రెసిడెంటుగాడి మాటలకి మన వాడికి....వేలెడంత లేడు....ఎక్కడలేని పౌరుషం వచ్చేసింది, సర్రున లేచి తింటున్న బిస్కెట్టు ముక్కని కుక్క నోట్లోంచి లాగి అవతలపారేసి బలవంతాన కుక్కని బరబర లాక్కుపోయాడు....ఇది చూసి మరీ నవ్వటం మొదలెట్టారు అక్కడున్న వాళ్ళందరూ. నవ్వుతున్న ప్రెసిడెంటుగారు హఠాత్తుగా అగి పెదాలమీద చిరునవ్వు అంటించుకొని ప్రక్కనున్న నా భుజం తడుతూ "రంగారావ్! మీ వోడు ఎమోషనల్ టైప్ వోయ్" అన్నారు నవ్వుతూ మనవాడు పార్టీనుంచి విసురుగా వెళ్లిపోవటం అతను ఇన్సల్టింగ్‌గా ఫీలయినట్టుంది .... ఆ పార్టీ అవుతున్నంతసేపూ నేను సిగ్గుతో అతనితో సరిగ్గా మాట్లాడలేక పోయాను. అదీ మనవాడి ఘనకార్యం."

"అందుకే గావాలండీ మొన్న సాయం

కాలం వాడి మొహం వాడిపోయుంది ఏవేవో చిరాగ్గా గొణుక్కుంటున్నాడు వీకేం తక్కువే, గతిలేక వాడి పార్టీకి వెళ్ళినట్లు ఇష్టం వచ్చినలాగ మాట్లాడు తున్నాడు వాడి దగ్గర పెద్ద కుక్క ఉందని ఒక్క ఎవడిక్కావాలి వాడి బాబుల్లాంటి బిస్కట్లు, కేకులూ కొని పెడ్తాన అంటూ కుక్కని నిమురుతూ మిల్కుబ్రెడ్ తినిపించాడండీ"

"అదికాదు సరోజం నువ్వు వాడిని శాస్త్ర భయంలో పెట్టాలి మనది ఇంతో అంతో గొప్ప కుటుంబం కదా! డీసెన్సీ ఉండాలంటావా? ఊరి కుక్కలతోనా వీడికి పావాసం మనం పెంచిన వాటికీ మనం ప్రేమించినవాటికీ మనలాంటి అంతస్తే ఉండాలికదా నేను కూడా అనాథశరణా లయంలో నా పేరన ఇద్దరు తిండిలేని కుర్రాళ్ళకి డబ్బిచ్చి పోషిస్తున్నాను అంత మాత్రాన వాళ్ళని కలేసుకొని నాతో క్లబ్బు లకీ, కార్లలోనూ తిప్పగలనా కావలిస్తే ఆల్సేషియన్. బుల్ టెరియర్ లాంటి కుక్కలని కొనిపెడతానూ, ఈ ఊర కుక్కని విడిచిపెట్టెయ్యి మన్నాను వింటేనా! అదే కావాలంటాడు పోనీ వాలుగు తందామంటే చేతులురావు. ఎలాగ?"

"పోనెద్దురూ! మీరు మరిన్నూ వాడే కొన్నాళ్లు పోతే మానేస్తాడు మీరు మాత్రం చిన్నప్పుడు రోజుకొక కుక్క పిల్లని తెచ్చేవాణ్ణని చెప్పలేదేంటి! మీలాగే వాడున్నూ బాబు పోలిక.

'అయితే మాత్రం నేను తెచ్చినవి ఇలాంటి కంతిరీకుక్కలా? బ్లడ్ హౌండ్ పెనీస్ డాష్"

'ఏదైనా కుక్క కుక్కేకదా! పాపం వాడికి జాకీ అంటే పంచప్రాణాలు. దానికి కూడా వాడంటే ఎంత ఇదో వాడు బడి నుండి వచ్చేదాకా గుమ్మంలో వాడికోసం కాచుకు కూర్చుంటుంది వాడు చేత్తో ఇచ్చే దాకా పంచభక్ష్య పరమాన్నాలైనా ముట్టదు వాడు రోజూ ఈమధ్య దానికి బిస్కట్లుకొని మేపుతున్నాడండోయ్" అది చాలా తెలివి గలదనిన్నీ శనివారం నీచు ముట్టదనీ. మిగతా ఊరకుక్కలాంటిది కాదనిన్నీ "మన వంట మనిషితో అప్పుడప్పుడు లెక్చర్లు ఇస్తుంటాడట అది ఇవన్నీ నాతో చెబుతూ ఒకటే నవ్వు" అంటూ సరోజం కూడా కొడుకుని తలచుకుంటూ మురిసి పోతూ నవ్వడం మొదలెట్టింది, రంగా రావుకి మెడమీద గుప్పెడు గొంగళి పురు గులు పాకురుతున్నట్టయింది

"చాల్లే కొడుకు ప్రయోజకత్వానికి మురిసిపోతున్నావు ఇదంతా నువ్విచ్చిన అలుసే నాకు రిమ్మెత్తిందంటే దాన్ని కాల్చి పారేస్తాను పీడా విరగడై పోతుంది"

ఇది విన్న సరోజం నవ్వుతున్నల్లా హఠాత్తుగా ఆగిపోయి "మీకు పుణ్యముం టుంది అలాంటి పనులేవీ చెయ్యగలరు. అసలే వాడు పట్టుదల గలవాడు. గొడవ

చేసి పారేస్తాడు మొన్న ఎంత హంగామా చేశా డనుకున్నారూ మీరు హైదరాబాదు వెళ్ళిన రోజున మళ్లీ వాడిని ఏమైనా అనగలరు నా మీద ఒట్టు చెప్ప కూడదనే అనుకున్నాను నా పాడునోరు జారిపోయింది

ఏమిటో సుపుత్రుడి ఘనకార్యం చెప్పు ఒట్లూ సత్యాలూ దేనికి?

ఆ రోజు రాజా ఇంకా బడినుంచి రాలేదు జాకీ కట్టు విడిపోయి వీధిలో తిరుగుతుంటే ఇదేదో బేవార్సు కుక్కని మునిసిపాలిటీ కుక్కల బండివాడు దాన్ని ఉరేసి బండిలో పడేసుకొని తీసుకుపోయాడు బడి నుంచి వస్తున్న మనవాడికి కుక్కలబండి ఎదురైంది తమాషా చూద్దామని బండిలోకి తొంగి చూశాడట ఇంకేముంది ఒక్కసారి కొండ విరిగి మీద పడినంత పనయింది కుక్కల మధ్యలో నిస్సహాయంగా బిత్తరిచూపుల్తో జాకీ రాజాని చూసి కుయ్యమని ఎడవటం మొదలెట్టింది చిందులుతొక్కుతూపుస్తకాలసంచీ రోడ్డుమీద పారేసి బండికి అడ్డంగా వెళ్ళి దాన్ని ఆపుచేస్తూ బండివాడిని నోటి కొచ్చినట్లు తిడుతూ నా కుక్కని ఒదిలేస్తావా లేదా అంటూ చేతి కందిన రాళ్ళతో బండిమీద ధన్ ధన్‌మని కొట్టడం మొదలెట్టాడంట జనం మూగిపోయారు దాంట్లో తెలిసిన వాళ్లెవరో రాజా మన అబ్బాయి దేననిన్నీ ఆకుక్క మనదేననిన్నీ చెబితే అప్పటికే సగం

హడిలి చచ్చిపోయిన బండివాడు కుక్కనీ, రాజానీ దండాలుపెడుతూ అగ్గిబరాటా లాంటి కుర్రాడు బాబోయ్ అంటూ కుక్కని ఒదిలేశాడట ఇంటికి వచ్చే టప్పుడు వాటి వాలకం చూస్తే నాకే భయం వేసింది కళ్ళు చింతగింజల్లా ఉన్నాయి ఒళ్ళంతా చెమటతో తడిసిపోయి రోడ్డు ధూళితో ఎర్రగా ఉంది అమ్మా! లంజకొడుకు మరి కాస్త ఆలస్యం చేసుంటే నాన్నగారి రివాల్వరు తీసి కెళ్లి షూట్ చేసి జాకీని విడిపించేసుందును! అంటూ పెదాలమీద జారుకున్న చెమటని మోచేత్తో తుడుచుకుంటుంటే నాకు చెడ్డ భయం వేసింది సుమండీ

ఇది వినేసరికి రంగారావుకి కూడా చిరుచెమటెక్కాయి

ఊహూ! నా రివాల్వరు తీయాలని కూడా కోరిక గలిగిందీ ఇంత వరకూ వచ్చిందీ వ్యవహారం ఊ ఎలాగ? అని కళ్లు మూసుకొని సోఫాలో సాలోచనగా చారగిలబడ్డాడు

బయట గాలి రయ్ రయ్ మని తెరలు తెరలుగా వీస్తోంది

• • •

సముద్రం ఘోష పెడుతోంది కెరటాలు తీరాన నల్లటి గుట్టల్ని ఢీ కొంటూ నురగలు గ్రక్కుతూ ఎగిరిపడుతున్నాయి బీచిలో చలి ఒణికించేస్తోంది

రాజా ఒడ్డున ఇసుకలో నడుస్తున్నాడు సూదిముక్కు బూట్లు తడి ఇసకలో

## ఒకే ఉతుకులో 3 దశలుగా పనిచేసి




# డెట్ బట్టలను ఎక్కువ తెల్లగా ఉతుకుతుంది

—ఏ యితర పౌడరు కంటె

## ఎలా చేస్తుందో ఎందుకు చేస్తుందో చూడండి:

**1వ దశ** డెట్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము బట్టలోనికి త్వరగా చొచ్చుకొనిపోయి, బాగా అంటుకొని ఉన్న మట్టిని కూడ వదలిస్తుంది—బట్టలు శుభ్రపడతాయి.

**2వ దశ** డెట్ మట్టిని వదలించిన తరువాత దానిని బట్టకు మళ్లీ అంటుకోకుండా చేస్తుంది—దుస్తులు శుభ్రపడతాయి శుభ్రముగా ఉంటాయి.

**3వ దశ** డెట్ బట్టలకు అదనపు తెల్లదనమును కలిగిస్తుంది—బట్టలు పూర్వము కంటె ఎక్కువ తెల్లగా ఉంటాయి! (గిరి లేక తెలుపు చేసే పదార్థమును చేర్చనక్కర్లేదు)

**డెట్‌ను నేడే కొనండి!** స్వస్తిక్ ఆయిల్ మిల్స్, బొంబాయి

SHILPI HPMA 38A/70 TEl





కసుక్కు-కసుక్కు-మంటున్నాయి ఊడుంది ఆగి గాలికి ముఖం చిట్లించుకొంటూ చుట్టు ప్రక్కల చూస్తున్నాడు నల్లటి ఆకాశం, నల్లటి మబ్బులు, నల్లటి కొండరాళ్ళు, కెరటాల తెల్లటి నురగలు దూరంగా మసగ్గా కనిపించే కొండలు సూదుల్లా పొడుస్తున్న చలిగాలి భేష్! బాగుం దను కున్నాడు నిర్జనంగా ఉంది తనూ, తన జాకీ, జాకీ రాజా వెంట నడుస్తోంది, జాకీ బక్కగా ఉంది చెవులు అందవికారంగా ఒకటి నిక్కబొడుచుకొని మరొకటి సగం వాలి ఉన్నాయి ఎండిపోయిన తెలగపిండి లాంటి అసహ్యమైన రంగు గుండె మీద చెదిరిపోయిన తెల్లటి మచ్చ. అసలు పిస లైన కల్తీలేని ఊరకుక్క

రాజాకి ఏదో ''కౌబోయ్'' ఇంగ్లీషు సినీమా జ్ఞాపకం వచ్చింది. ఆ హీరోకి కూడా తనకి లాగే కుక్క ఉంది రెండు జేబుల్లో పిస్తోళ్ళున్నాయి కేవలం కుక్క సహాయంతో దొంగల ముఠాని తరిమి తరిమి కొట్టాడు గొప్ప సీను థ్రిల్లింగ్ ఎడ్వంచర్ కమాన్ జాకీ

జాకీ! దూరంగా నత్త గుల్లల్ని వాసన చూస్తున్న జాకీ ఉరకలేసుకుంటూ వస్తోంది దాని అడుగుల జాడలు తడి ఇసకలో తీర్చి దిద్దినట్లు కనిపిస్తున్నాయి. హుర్రే సర్! సర్! విషిల్సు కమాన్ భౌభౌ .

''రాళ్ళబండల వెనకాల దొంగలు పొంచి ఉన్నారు హుర్! జాగ్రత్త!.!

ప్చ డోన్ట్ కేర్.. అమాంతంగా ఏడడుగులు పెరిగిపోయాడు, ఎర్రటి కంద గడ్డలాంటి జిడ్డు కారుతున్న దొర మొహం....పిల్లి కళ్ళు, ఇనపకొక్కాల

బూట్లు . జేగురు రంగు జాత్తు హిప్ పాకెట్సులో రివాల్వర్లు టోపీ సర్దుకుంటూ నెమ్మదిగా అడుగులో అడుగు వేసికొంటూ నడుస్తున్నారు

డం డం డం భయంకరమైన ఇంగ్లిషు మ్యూజిక్కు బోఁయ్! బోఁయ్ లంగరువేసిన స్టీమరు అరుస్తోంది సముద్రం మధ్యలో. రాళ్ళ వెనకాలనుంచి ఒక చెయ్యి లేచింది క్లిక్! క్లిక్! చేతిలో ఆరుగుళ్ళ పిస్తోలు మన హీరో వైపు తిరుగుతోంది బౌ బౌ బౌ జాకీ! డామిట్ కీప్ క్వయిట్ చెయ్యిగురికోసం వెతుకుతోంది హీరో నవ్వుకున్నాడు పెదాలు కదుపుతున్నాడు . జేబులో నించి సిగరెట్టు .. అగ్గిపెట్టె . లేదు బేక్ పోకెట్టు అంతే! టిష్యూ .. టిష్యూ టిష్యూ హిప్ పోకెట్ లోనించి తీసిన రివాల్వర్లు నిప్పులు కక్కుతున్నాయి . టిష్యూ .. టిష్యూ ..టిష్యూ . దొంగలురాయి వెనకాల్నించి కాలుస్తున్నారు పట్టీలు మొగ్గలు దొర్లడం టిష్యూ. .టిష్యూ

టిష్యూ టిష్యూ టిష్యూ కాలుస్తునే గుళ్ళవర్షంనుంచి తప్పించుకొంటూ మొసలిలా పాకురుకుంటూ పడవ ప్రక్కన నక్కిపోయాడు .. ఉండండి టిష్యూ .. దొంగలు టిష్యూ . ఇసక రేగిపోతోంది బౌ బౌ బౌ శ్! నోరు నొక్కి జాకీని ఒళ్ళోకి లాక్కొన్నాడు నిశ్శబ్దం అంతా నిశ్శబ్దం... హీరో ఎక్కడున్నాడో దొంగలికి తెలియటంలేదు... మందుగుండు వాసన నిశ్శబ్దం ట్లాట్ ట్లాట్ ట్లాట్ ట్లాట్ వాట్! గుర్రాలు ట్లాట్ ట్లాట్ డెక్కల చప్పుడు మైగాడ్! ఆదనపు దొంగల గుంపుగుర్రాల మీద వస్తున్నారు దగ్గరౌతోంది ట్లాట్, ట్లాట్ ట్లాట్ ఛెళ్ ఛెళ్ కంచీ దెబ్బలు హి హ్హి హ్హీ గుర్రాల సకిలింపులు టక్ టక్ . టక్ . గాలించేస్తున్నారు అబ్బ! కుక్కతో తొక్కేసుందురో వేరీజ్ దిడెవిల్? తాగి వాడివా అడిగాడు సమ్ వేర్ హియర్ బాస్ పెర్చ్ ఒక దున్నపోతు కొండ రాయిమీద నిల్చొని ఎడమచేత్తో పొ రాసుకుంటూ చీకటితో వెతుకుతున్నాడు కుడిచేతిలో పెద్ద తుపాకీ హీరో కనిపించడంలేదు కసికొద్దీ గుర్రాల్ని భె ళ్ళుమని బాదేస్తూ దౌడాయిస్తున్నారు గుర్రాల డెక్కల క్రింద ఎర్రటి ధూళి రేగుతోంది రైట్ ఏక్షను సమయం చూశాడు పడవమీద రెండు పిస్తోళ్ళు ఆడించాడు... ఓకే! టిష్యూ కొండ రాయిమీద దున్నపోతు దొర్లిపొయ్యాడు సముద్రంలో పడి గిలగిల కొట్టుకుంటున్నాడు వాడి నెత్తుర్ని కెరటాలు ఒడ్డు చిమ్ముతున్నాయి ఎక్కడనుంచి దెబ్బల వస్తుంటు? .. కనిపించటంలేదు.. హడలిపోతున్నారు స్కార్లెట్ పింర్నల్ టిష్యూ టిష్యూ . టిష్యూ . ఒకరు. ఇద్దరు . ముగ్గురు గుర్రాల మీది నుంచి దొర్లిపోతున్నారు




టిష్యూ.. ...హా హ్హా హ్హీ.. ..గుర్రం గుండెల్లోనించి దూసుకు పోయింది. గభీమని కూలిపోయి దబదబ తన్నుకుంటోంది. దానిక్రింద ఒకడు అప్పడంలా కసుక్కుమని అణిగిపోయాడు. వాడి నెత్తురు ఇసకలో ఇంకుతోంది. టిష్యూ మిస్ అయిపోయినది, మిగిలిన ఒక్కడూ "మైగాడ్! టఫ్‌గై" అంటూ అదే దౌడు.. తువకీ కాల్పులకి జడిసిపోయి గుర్రాలు తోక లెత్తుకుంటూ వెర్రిగా సకిలిస్తూ గజిబిజిగా పరుగెత్తుతున్నాయి. వాటిని జాకీ బౌ బౌ మని వెంట తరుముతోంది. చచ్చిన దొంగల శవాల్ని కసితీరా కొరికేస్తోంది. హీరో పడవ ప్రక్కనుంచి లేచి పిస్తోళ్ళు జేబులో పెట్టుకొంటూ విజయగర్వంతో రణభూమిని కలయ చూశాడు. చచ్చిన దొంగల శవాలు ... ఇంకా ప్రాణంతో తన్నుకుంటున్న గుర్రం నెత్తురు .. బ్లడ్ ... విజయం తనూ తన కుక్క జాకీ హీరో. కంగ్రాచ్యులేషన్స్ జాకీ . గొప్పసీను . థ్రిల్లింగ్ .. ఎడ్వెంచర్ ...హుర్రే' పన్నెండేళ్ళు నిండిన రాజా ఆనందంతో రెచ్చిపోయి గెంతుతున్నాడు.

ఈ ఏక్షనంతా నిజమనుకొని జాకీ బౌ బౌ మంటూ పరుగులెత్తుతోంది. రాజా నటనని చూసి నిజంగా తన యజమానిని శత్రువులెవరైనా హాని చెయ్యాలని చూస్తున్నారేమోనని వాళ్ళకోసం అరుచుకుంటూ వెళుతోంది. అది గమనించిన రాజా ఆనందంతో మురిసి పోయాడు. పూర్ రాజా అంతా నిజమనుకొంటోంది. ఎంత మంచి కుక్క. ఎంత విశ్వాసం గల కుక్క. ఎంత గొప్పకుక్క. అమాం

తంగా ఎత్తేసుకొని ముద్దులాడాడు. ఒళ్లో పడుకోబెట్టుకొని దాని ఒంటిమీద ఇసక దులిపాడు. దాని చెవిలో వేలాడుతున్న కొఱుసుని తీసి నలిపి పారేస్తుంటే బాధగా జాకీ "కంయ్‌క్క్" మని అరిచింది "పరవాలేదే" అని బుజ్జగిస్తూ ఒళ్ళంతా నిమురుతున్నాడు తల్లి ఒడిలో పిల్లాడి లాగ రాజా ఒడిలో ముడుచుకొని గారాం చేస్తోంది "షేక్‌హాండ్" యివ్వమన్నట్లు రాజా గుండెలమీద కాలుతో తీకుతోంది రాజా గుడ్! గుడ్! అంటూ షేక్‌హాండు చేస్తున్నాడు. మొహమంతా నాకేస్తూంది దాని నాలుక గరుకుగా, ముక్కు చల్లగా గిలిగింతలు పెడుతోంటే మైమరచి పోతున్నాడు.

హఠాత్తుగా ఆ సమయంలో పార్టీలో ప్రెసిడెంటు జ్ఞాపకం వచ్చాడు మీసాల లోనించి వాడినవ్వు తలుచుకుంటే రాజాకి కోపంతో ముఖం ఎర్రబారింది. "ఏంటోయ్ రాజా! ఎక్కడ సంపాదించావ్ ఈ సీమ కుక్కని——" ఎంత హేళనగా ఉంది. అందరిలోనూ తనని అవమానించాడు. పరాభవించాడు ఊరకుక్కని కదూ? అవును! నిజంగా తనది ఊరకుక్కే అయితే మాత్రం దానికేం తక్కువని దానికికూడా సీమ కుక్కలాగే నాలుగు కాళ్లూ ఒక నోరూ ఉంది సీమ కుక్కకి రెండు నోర్లు ఉన్నాయా? ఎనిమిది కాళ్ళు న్నాయ్యా? దొరల దేశంలో కుక్కని ఈ దేశంలో సీమకుక్కంటారు. మరి తన జాకీని కూడా ఏ లండనులోనో పెడ్తే అక్కడ యదికూడా సీమకుక్క కాదేమిటి? ఎప్పుడైనా వీలుపడితే తన జాకీని ఉస్కో పెట్టించి ప్రెసిడెంటుగార్ని కరిపించేద్దా మనుకున్నాడు అప్పుడు తెలిసొస్తుంది ఊరకుక్క తడాఖా వాడి దగ్గర అల్సేషియన్ కుక్క ఉందని పొగరు ఎవడిక్కా వాలి ఇది అరుస్తే నూతిలోనుంచి అరుస్తున్నట్లుంది పొడుగా ఎప్పుడూ నాలిక బయటికి చాచుకొని ఒగరుస్తూంటుంది ఛీ! అది దగ్గర కొస్తేనే గమ్మికింపు ఇంట్లో ఉన్నంతసేపే దాని డాబు బయట కొస్తే తోక ముడుచుకుంటుంది అది అసలు కుక్కా అని? పెద్ద నక్కలా ఉంటుంది అబ్బా! దానిక్కూడా ఎంత పొగరని! ఒకసారి కారులోనుంచి తన జాకీ పైపు చూసి అరిచింది అది పెద్దదని దాని డాబు ప్రెసిడెంటుగాడి కుక్కనని దాని పోజు దాని ఒంటినిండా కండ లున్నాయని గర్వం జాకీకికూడా మంచి తిండి పెడితే దాని బాబులాంటి కండ లొస్తాయి ఎటొచ్చి దానికి మంచి తిండి పెడతానంటే నాన్న ఒప్పుకోడు. నాన్న కూడా తన కుక్కని "ఊరకుక్క" అని చీదరించుకుంటుంటాడు. అయినా నాన్నకి తెలీకుండా అమ్మ దగ్గర డబ్బు లడిగి జాకీకి బ్రెడ్లు, కేకులు, బిస్కత్తులు తిని పిస్తున్నాడు రోజూ తను తీసుకుంటున్న టానిక్కు ఒక్కొక్క చెంచాడు పడు తున్నాడు. గాని కండలు పెరగడంలేదు.

స్కూల్లో విల్సన్‌గారు చెప్పాడు గొడ్డు మాంసం పెట్టలని ఎలాగైనా గొడ్డు మాంసం తినిపించాలి జాకీకి కండలు పెరగాలి. అది పెద్దదవాలి గుర్రం అంత అవాలి. అప్పుడు ప్రెసి డెం టు గాడి కుక్కతో పోట్లాటకి పట్టుకెళ్ళాలి, అసలు ప్రెసిడెంటుగాడి కుక్కని ఏదైనా లారీ తొక్కేస్తే బాగుణ్ణు

నాన్నకి కూడా జాకీఅంటే అయిష్టమే ఎందుకు చెప్మా? దాన్ని ఏదో నెపంతో బూటుకాళ్ళతో తంతాడు. దానిక్కూడా సబ్బురాసి స్నానం చేయిస్తే కస్సుమం టాడు, అది ఊరకుక్క అట అది పెంటలమీద ఉండాల్సిందేగానీ గొప్పోళ్ళ ఇళ్ళల్లో ఉండటానికి అర్హత లేదంటాడు. మరి నాన్నగారంటే జాకీకి ఎంత ఇష్టమో! అతని కాళ్ళ మధ్యలో దూరి ఆడుకోబో తుంది ఎగిరి గుండెలమీద ఆప్యాయంగా ఎగబ్రాకాలని చూస్తుంది, నాన్న సంతో షించడు సరికదా కొట్టి కొట్టి చంపేసి నంత పని చేస్తాడు అయినా నాన్న అదో రకం మనిషి. పని మనుసులతోనూ, పేద వాళ్ళతోను సరిగ్గా మాట్లాడడు. వాళ్ళవైపు గొంగళిపురుగులను చూసినట్టు చూస్తాడు. మాటాడవలసొస్తే అమడ దూరాన్నుంచే మాట్లాడుతాడు. తన జాకీని చూసినట్లే వాళ్ళకికూడా చూస్తాడు, జాకీలాగ వాళ్ళు కూడా నాన్న దృష్టిలో ఊరుమనుషులే నేమో? మరి అతను లండనులో పుట్టాడా? కాదు గదా! అలా అయితే అతనుకూడా "ఊరుమనిషే" కదా! కారుల్లో వచ్చిన వాళ్ళని, సూటుల్లో వచ్చినవాళ్ళని కౌగ లించుకుంటాడు. మినిష్టరు వస్తే అతని వెంట కుక్కలాగ తిరుగుతాడు. జాకీ మాత్రం తనవెంట తిరగడానికి ఒప్పు కోడు ఏమిటో! తనతండ్రి మనస్తత్వం రాజా పసిహృదయానికి అంతు పట్టడం లేదు,

ఒకటి మాత్రం నిశ్చయించుకున్నాడు ఏది ఏమైనా జాకీని మాత్రం విడిచిపెట్టేది లేదు. అది తన ప్రాణం. దానికింకా బ్రెడ్లు, బిస్కత్తులు, టానిక్కులు మేపాలి. గొడ్డుమాంసం పెట్టాలి సర్కసులో కుక్కల్లాగ లెక్కలు చేయించాలి. పోలీసు కుక్కల్లాగ దొంగల్ని పసిగట్టే తర్ఫీదు ఇవ్వాలి. అడవుల్లో ఉన్న జాతికుక్కల్తో పోట్లాడించి చిత్తుచెయ్యించాలి ప్రత్యే కించి ప్రెసిడెంటుగాడి కుక్కతో మిసెస్ రాజారావు మీద రాజా కించిత్ కోపంఉంది. అదికూడా ప్రెసిడెంటుగాడితో కలిసి నవ్వింది. గారపళ్ళది.దానికుక్క మహా పెద్దకుక్కలాగ. ఎప్పుడూ అడాళ్ళ అద్దాల్లో పడుకొనే అడారి కుక్క దానిని అసలు ఏ పిల్లయినా ఇట్టే చంపెయ్య గలదు, తన కుక్కదాకా ఎందుకూ?

ఒళ్ళో గారాం చేస్తున్న జాకీ లేచి ఒక్క కుదుపు కుదిపి రాజాని కదిలించు కొని బౌ బౌ మని పరుగెత్తింది. ఆ కుదుపుతో రాజా పెల్లికిలా పడి పోయాడు. నీటి ఒడ్డున కాకులు కావు

కావు మసీ ఎగురుతున్నాయి. వాటిని పట్టు కునేందుకు జాకీ ఎగురుతూ బౌ బౌ మని అరుస్తోంది. వెంటాడుతోంది వెల్లకితలా పడిపోయిన రాజా ఆ దృశ్యాన్ని చూస్తూ ఆనందంతో దొర్లుతూ "కేచ్ జాకీ కేచ్" అని అరచాడు. కాకులు విసుగెత్తి పోయి దూరంగా తాటిచెట్లవైపు ఎగిరిపోయాయి. జాకీ డిస్సెపాయింటింగ్‌గా ఒగరుస్తూ, తన ఓటమికి సిగ్గుపడుతూ తోకాడించుకొని ఇసకలో పొర్లుతున్న రాజా దగ్గరికి వచ్చింది. "కమాన్! కమాన్! పిచ్చి ముండా కాకులు దొరుకుతాయటె!" అని



జాకీని మీదికి లాగుకున్నాడు. జాకీకి మ ముద్దు ఎక్కువైపోయింది. బౌ బౌ మని రాజా మీదికి దూకుతూ బట్టల్ని నోటితో లాగుతూ విదిలించడం మొదలెట్టింది. రాజా ఉండుండి ఒక్కొక్క తోపు తోస్తున్నాడు దబాలున వెనక్కి పడి పోతోంది. తిరిగి కలబడిపోతోంది. రాజా దొర్లుతూ అటూ ఇటూ తప్పించుకుంటు న్నాడు. కరవబోయేటట్లు నటిస్తూ కోపంగా మొరుగుతూ మీదికి ఒచ్చేది. రాజా కాంప న్‌లా ఎడమచెయ్యి గాని నోట్లో పెట్టి అణిచేస్తూ, కుడిచేత్తో పొట్టమీద డిస్కూ! డిస్కూ! మని ముద్దుగా గుద్దుతున్నాడు. ఒకళ్ళమీద ఒకళ్ళు పడి దొర్లుతున్నారు. అరుపులు నవ్వులు కేకలతో మైమరచి పోతున్నారు. అలా పట్టు పరుపుమీద పెరిగిన రాజా, పెంటకుప్పల్లో పుట్టిన ఊర కుక్కని కౌగిలించుకొని దొర్లుతుంటే ప్రేమకి, స్నేహానికి అంతస్తులతో నిమి త్తం లేదని అనిపించకమానదు

సంజెచీకట్లు మెల్ల మెల్లగా అల్లుకుంటు న్నాయి. యారాడకొండ మీద డేంజర్ లైటు వెలిగింది, ఎర్రగా బ్లింక్ అవుతోంది. ఆకాశంమీద మేఘాలు మరింత చిక్క బడుతున్నాయి. సముద్రంలో కెరటాలు ఆకలిగొన్న రాక్షసుడిలా ఉధృతంగా లేస్తున్నాయి. భయంకరమైన తుఫాను రావచ్చు. రంగారావు కోరిక ప్రకారం పూరిగుడిసెలు ఎగిరిపోనూవచ్చు, కష్ట రోగి తలదాచుకోడానికి చోటు దొరక్క

చలిలో కొయ్యబారి చచ్చిపోనూవచ్చు—

చెలగాటంలో రాజా జేబులో దాచు కొన్న బంతి త్రుళ్ళిపోయి ఇసకలో పరుగెత్తిం జాకీ దానిని వెంబడించి చిటికలో నోట కరచుకొని తెచ్చి పడేసింది. "శభాష్!" అని వీపుమీద చరుస్తూ లేచి తిరిగి బంతి విసిరాడు. జాకీ దాన్ని గాలిలోనే పట్టుకోబోయి మిస్ అయిపోయింది బంతి ఒడ్డున కొండరాయికి ఢీకొని తుప్పున ఎగిరి సముద్రంలో పడిపోయింది. బాణంలా సముద్రంలోకి దూకింది జాకీ కెరటాల్లో మునకలేస్తూ బంతిని పట్టుకుంది తడిసి ముద్దయిపోయి ఒణుకుతూ బంతిని తెచ్చి రాజా పాదాల దగ్గర పడేసింది "అయ్యో! అయ్యో! చలిలో ఒణికిపోతున్నావ్ ముండా పద పద పోదాం చీకటి పడిపోతూంది" అంటూ బంతిని తీసి చేతిలో ఎగరేసుకుంటూ ముందుకు నడిచాడు రాజా జాకీకి ఇంకా సరదా తీరలేదు సముద్రం నీటిలో తడిసి గజ గజ లాడిపోతున్నా ఇంకా సరదాగానే ఉంది ఇంకా ఆడుకోవాలనే ఉంది రాజా కాళ్ళకి అడ్డంపడుతూ కుంయ్ కుంయ్ మని మారాం చేస్తూ ముందుకు నడవనీయకుండా అడ్డంవస్తోంది గుండెల మీదికి ఎగబ్రాకుతూ ముందరి కాళ్ళతో రాజాని బకురుతోంది "అబ్బా! నీకు బంతిని చూస్తే మతిపోతుంది. చీకటి పడిపోయిం. నిన్నూ నన్నూ కూడా నాన్న చీరేస్తాడు" అని సముదాయించడం మొదలెట్టాడు జాకీ పట్టు విడువలేదు. "మరి కాస్సేపు ఆడుకుందాం రాజా" అన్నట్లు దీనంగా రాజా కళ్ళల్లోకి చూసింది అలా చూస్తుంటే రాజాకి కనికరం వేసింది. "సరే కానీ!" బంతిని సూటిగా సముద్రంలోకి విసిరాడు ఇలా బంతిని విసిరాడో లేదో అలా సముద్రంలోకి దభాలున దూకి బంతితో తిరిగి వచ్చేసింది

'శభాష్' భలే రైట్" అంటూ చప్పట్లు చరిచాడు.

తిరిగి విసరబోతూ చేతికి గరుకుగా తగిలేసరికి బంతిని పరీక్షగా చూశాడు బంతి మీద కుక్క పంటిగాట్లు పడ్డాయి. వాటిలోనించి గాలి బుడగలు సుంయ్ సుంయ్ మని ఉబుకుతూ చిట్లుతున్నాయి. తన కుక్క పంటిగాట్లు అంత గట్టిగా పడినందుకు ఉప్పొంగిపోయాడు బంతిని నొక్కుతుంటే సర్ సర్ మని నీరు పిచ్చికారీ కొట్టినట్లు మొహంమీద తుళ్ళతోంది 'ఎం పట్టురా బాబూ! రబ్బరు బంతి లాంటిదే కన్నాలు పడిపోయింది రేపు పోట్లాటలో ప్రెసిడెంటుగాడి కుక్క ఏమాత్రం, అమాంతంగా దాని తల కొరికి పారేస్తుంది జాకీ కావాలి అది చావాలి" ప్రెసిడెంటు వాడికుక్క జ్ఞాపకం వచ్చేసరికల్లా అంతవరకు అణగారినకోపం, క్రోధం ఒక్క వూపున సముద్రంలోని కెరటాల్లా వెర్రితలలెత్తాయి రక్తం మరిగిపోతోంది. పట్టరాని ఆవేశంలో పళ్ళు బిగబట్టి చేతిలో బంతిని అప్రయత్నంగా కసిగా పిసికాడు

రంయ్‌మని నీరు ముఖాన్ని చిమ్మింది.

'ఇలానే దాని నెత్తురు చిమ్మాలి నెత్తురు మడుగులో గిలగిల తన్నుకు చావాలి'' అంటూ నోటిమీదికి జారుతున్న ఉప్పు నీటిని నాలికలో చప్పరిస్తూ కసిగా తిరిగి బంతిని సముద్రంలోకి విసిరాడు

''కాచ్ జాకీ కాచ్ ''

జాకీ తెచ్చేసింది

'గుడ్! గుడ్! వన్స్‌మోర్! కేచ్'' అంటూ రెట్టింపు జోరులో విసిరాడు

మరింత స్పీడగా తెచ్చింది

కసితో, కోపంతో, క్రోధంతో, ఈర్ష్యతో ఊగిసలాడిపోతూ, ఒళ్ళు మరచి పోయి బంతిని సముద్రంలోకి విసురుతూనే వున్నాడు జాకీ తెస్తూనే వుంది ఇద్దరూ అలిసిపోయి ఒగురుస్తున్నారు

చీకటి ఎక్కువౌతోంది కెరటాలు మసగ చీకటిలో మరింత భయంకరంగా కనిపిస్తున్నాయి, కొండ మీద దేంజరు లైటు మరింత ఎర్రగా కనిపిస్తోంది రాజా జాకీ తెల్లతెల్లటి ఇసక మీద నల్లటి నీడల్లా పరుగెత్తుతున్నాడు

రాజా బలంపూర్తిగా బంతిని విసిరాడు,

గాలిలా వెంబడించింది జాకీ,

చివ్వున నల్లటి సముద్రం నీటిలోకి చొచ్చుకు పోయిన బంతి మసక చీకటిలో జాకీకి కనిపించలేదు హఠాత్తుగా ఆగి పోయింది బంతి ఎటుపోయిందో తెలియక తటపటాయిస్తూ నీటి అంచులు దగ్గర వెతుకుతోంది. జాకీ గ్రేడ్ తినేసింది, బంతి తేలేకపోయింది. ఓడిపోయింది.

''షేమ్! షేమ్! బంతిని తేలేకపోయావ్ షేమ్ షేమ్'' అంటూ కేరింతలు కొడుతూ గెంతుతున్నాడు రాజా

బంతి జాడ తెలియని జాకీ కుంయ్ కుంయ్‌మని అరుస్తూ చిరాగ్గా కాళ్ళతో బురదని తవ్వేస్తోంది

''షేమ్! షేమ్! వాట్ జాకీ, రేపు ప్రెసిడెంటుగాడి కుక్కతో పోట్లాటలో ఇలాగే డీసీటయిపోతావా ఎమిటి? ఊ! క్విక్! క్విక్ షేమ్! షేమ్'' అని అరుస్తూ ఎగతాళిగా కవ్విస్తున్నాడు.

జాకీ నిజంగానే షేమ్ ఫీలయ్యింది. అది విడిచిపెడ్తుందా?....సప్త సముద్రాల్లో ఎక్కడ దాక్కొని ఉన్నా బంతిని లాక్కొని రాదూ! రెండడుగులు వెనక్కి వేసింది. ఒలాన్న యావత్తూ కేంద్రీకరించుకొని గభాలున నీటిలోకి డైవ్ చేసింది

షేమ్! షేమ్ షేమ్ '' అంటూ ఇంకా గెంతుతున్నాడు రాజా.

పెద్ద కెరటం ఏనుగెత్తు ప్రమాణంలో లేచి భళ్ళున సుడుం తిరుగుతూ తిరిగి పోయింది

కుంయ్ - కుంయ్ ' రెండే అరుపులు.

అవి జాకీ అరుపులు.

అవి అరుపులు కావు ఆక్రందనలు - ఏడారి మధ్యలోనో, నడి సముద్రంలోనో నిస్సహాయంగా అరిచినట్లున్నాయి,

నవ్వుతున్న రాజా హఠాత్తుగాగతుక్కు

కుని ఆగిపోయాడు.

ఒడ్డున విరిగిన కెరటం జంయ్‌మని పెద్ద చప్పుడు చేసురుంటూ వెక్కి తన పని అయిపోయినట్లుగా వెళ్ళిపోయింది.

రాజా మతిపోయినవాడిలా నీటి ఒడ్డుకి పరుగెత్తాడు. 'జాకీ' అని పిలిచాడు

"కమాన్ జాకీ! కమాన్! జాకీ కమాన్. జాకీ" అని అరుస్తున్నాడు ఆ పిలుపులు అనుమానంగా వున్నాయి పిలుపు విని పరుగెత్తుకొని వచ్చినట్లు బంతి సంయ్‌మని సముద్రంలోనించి కొట్టుకొచ్చి రాజా పాదాలకి రంయ్‌మని రాసుకుంటూ పోయింది.

జాకీ మాత్రం రాలేదు

"జాకీ జాకీ వెళిపోదాంరా జాకీ - చీకటి పడిపోతోంది" అని పిలుస్తున్నాడు గొంతుకు రుద్ధమౌతోంది

జాకీ రావటం లేదు

కెరటాలు వస్తున్నాయి. తిరిగిపోతున్నాయి వాటి నురగలు మెత్తని ఇసకలో సుంయ్ సుంయ్ మని ఇంకిపోతున్నాయి.

ఎంత పిలిచినా జాకీ లేదు.

అర్ధమయింది ఆ పెద్ద కెరటం జాకీని మింగేసింది

ఎపి హృదయం ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది. క్షణం క్రితం తను కనిన కలలు చెదిరిపోయాయి. తను నిర్మించుకున్న లక్క గృహం కాలిపోయింది,

పిచ్చిగా అటూ యిటూ పరుగెత్తుతున్నాడు, దొర్లి దొర్లి ఏడుస్తున్నాడు. జుత్తు పీక్కుంటున్నాడు.

"జాకీ! జాకీ జాకీ రా జాకీ పోదాం."

రాజా వెక్కి వెక్కి ఏడుస్తుంటే, నిర్జన శ్మశానంలో బిడ్డ శవం మీద పడి ఏడుస్తున్న తల్లి ఆక్రందనలా ఉంది

ఏడుగంటలు కావస్తున్నా ఇంటికి తిరిగిరాని రాజా కోసం ఇంట్లో ఆందోళన పడిపోతున్నారు. సముద్రాన్నీ, చీకటినీ తలచుకుంటుంటే సరోజకి అనుమానం ఎక్కువైసాగింది. ఆట్లాడుకుంటూ నీళ్ళలోకి వెగాదేమో! 'అయో ' అనుకుంది. కొడు

కుని వెంటనే వెతికి తీసుకు రమ్మనమని నౌకర్లని పంపించింది, వాళ్ళతోపాటు రంగారావు కూడా బయలుదేరాడు. సరోజ ఏడుపు లంకించుకుంది

'ఎందుకు ఏడుపు ఏమయిందని ఆ పాడు ఊరకుక్కతో ఆట్లాడుకుంటూ కూచో నుంటాడు. ఏది ఏమైనాసరే రేపు ఆ కుక్కని కాల్చిపారేస్తాను' అంటూ కోపంలో తలకీ మఫ్లర్ చుట్టుకొంటూ చేతిలో బేటరీలైటు తీసుకొని బయలు దేరాడు.

లైటు వేసుకుంటూ నీలో వెదు తున్నారు ఎక్కడా రాజా కనిపించటం లేదు. రంగారావు కూడా ఆందోళన పడ సాగాడు. నౌఖర్లు 'బాజాబాబూ! రాజా బాబూ! అని అన్ని వైపులా నరుగెత్తు కుంటూ పిలుస్తున్నారు. రాజా అలికిడి ఎక్కడాలేదు అలా వెతుకుతుంటే కొద్ది దూరంలో రాజా బంతి కనిపించింది లైటులో, రాజామాత్రం చుట్టుప్రక్కలా ఎక్కడా కనిపించటంలేదు. బంతిని చూడ గానే రంగారావు మరింత గాబరా పడి పోయాడు. పిచ్చిగా నౌకర్లను కేకలేస్తు న్నాడు. "మొద్దు సన్నాసుల్లారా, అన్ని వైపులా సరిగ్గా వెతకండిరా" అని కసురు తున్నాడు.

అంతకంతకి రంగారావుకి అనుమానం ఎక్కువవుతుంది

"రాజా, రాజా" అని పిలుస్తూ పరు గెత్తటం మొదలు పెట్టాడు, చెమట్లు కక్కుకుంటున్నాడు. మాటి మాటికి సముద్రం మీద లైటు వేస్తున్నాడు.

"రాజా రాజా రాజా "

సముద్ర ఘోష తప్పించి అంతా నిశ్శబ్దం,

సముద్ర పొద్దున కనిపించిన ప్రతీ రాయిని చూసి రాజా ఏమోనని గతుక్కు మని అనుమానంగా ఆగిపోతూ వాటిమీద పదేపదే లైటువేసి చూస్తున్నాడు— గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి.

లైటు హౌసు కాంతి ఉండండి సముద్రం మీద చీకటిని చీల్చుకొని పరు గెత్తుతోంది

హఠాత్తుగా దూరంగా 'జాకీ" అనే సన్నని కేక వినిపించింది, హోరుగాలి శబ్దంలో కలసిపోతున్న కేక ఎక్కడో దూరంగా కొండ లోయల్లోంచి వినవస్తు న్నట్టుంది

"జాకీ "

అవును రాజా గొంతే? మామయ్యా!

"రాజా రా జా ఇక్కడున్నాను. ఇలారా ' అని మరింత బిగ్గరగా అరిచాడు మనస్సు తేలికపడింది కొడుకు దొరికి పోయాడు

రాజాకి మాత్రంజాకీ దొరకలేదు

"జాకీ! జాకీ జాకీ ' అరుపులు

వగ్గరౌతున్నాయి. రాజా ఏడుస్తున్నట్లు ఆ అరుపులో స్పష్టంగా తెలుస్తోంది.

"జాకీ....జాకీ....కమాన్ జాకీ.... కమాన్....జాకీ."

"రాజా....రాజా....రాజా....ఇ ది గో ఇక్కడా....లైటు' అంటూ రంగారావు కొడుక్కి ఎదురుగా పరుగెత్తుకు వెళు తున్నాడు.

సముద్రం వైపు చేతులు చాచుకుంటూ ఏడుస్తూ. జాకీని పిలుస్తూ తూలిపోతూ అటునుంచి పరిగెత్తుకొని వస్తున్నాడు రాజా.

తండ్రీ కొడుకుల అరుపులు ఆ నిర్జన సముద్ర తీరంలో ఖంగు ఖంగు మంటు న్నాయి.

రాజాని చూడగానే రంగారావు చచ్చి పోయిన కొడుకు బ్రతికి వచ్చినట్టుగా సంబరపడిపోతూ ఉక్కిరి బిక్కిరయి పోతూ 'రాజా! రాజా!' అని కొడుకుని పరుగెత్తుకెళ్ళి కౌగలించుకున్నాడు తండ్రిని చూడగానే రాజా ఒక్కసారి బావురు మన్నాడు, ఏదో చెప్పబోయాడు. మాట సరిగ్గా పెగలటం లేదు. ఏడుపులో కలిసి పోతోంది. ''నాన్నా....నాన్నా....జాకీని.. కెరటం....కెరటం మింగేసింది'' అని అన గలిగాడు. చేతులూ కాళ్ళూ నేల మీద హిస్టీరిక్‌గా కొట్టుకుంటూ ఏడుస్తున్నాడు. గుప్పెళ్ళలో ఇసక తీస్తూ సముద్రం వైపు కోపంగా విసురుతున్నాడు. రాజానిఓదార్చ లేక పోతున్నారు. కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నాడు. బలవంతాన పట్టుకొనిపమ దాయిస్తూ నడిపిస్తుంటే గింజుకుంటూ విది లించుకొని సముద్రం వైపు పరుగెత్తుతు న్నాడు. ఏలాగయితేనేం అతి కష్టంమీద ఇంటికి చేర్చారు.

కుక్కతో ఆటకి వెళ్ళిన రాజా ఒంట రిగా యింటికి తిరిగొచ్చాడు.

తను ఏవగించుకుంటున్న పూరకుక్క చచ్చిపోయింది. పెద్ద భారం నెత్తిమీద నుంచి దిగినట్లు తేలిక ఫీలయ్యాడు రంగా రావు. పోనీ! తన ప్రమేయం లేకుండా దానంతట అదే చచ్చింది. ఈసారి తన కొడుక్కి మంచి జాతికుక్కని—కనీసం ఆల్సేషియన్‌ని కొనిపెట్టాలని అనుకుంటూ పుత్రాన్వేషణలో అలిసిపోయిన తన శరీ రాన్ని, మనస్సునీ మరి రెండు ఎక్స్ట్రా పెగ్గుల విస్కీతో జోకొట్టి పడుకోబెట్టే శాడు.

ఆ రాత్రి జ్వర తీవ్రతలో రాజా సము ద్రాన్ని, కెరటాల్నీ, ప్రెసిడెంటునీ, వాడి కుక్కనీ బూతులు తిట్టాడు.

* * *

మరుసటి రోజు—

బాగా ప్రొద్దెక్కింది. ఎండ కాస్తోంది. ఆకాశం నిర్మలంగా వుంది. మేఘాలు లేవు. జ్వరంలో లేచి తూలుకుంటూ కిటికీ లోంచి సముద్రంవైపు చూశాడు రాజా. సముద్రం మామూలుగా వుంది. నిన్నటి లాగ నల్లగా లేదు. నీలంగావుంది. సూర్య కిరణాలు ప్రతిఫలిస్తున్నాయి, తన జాకీని




పొట్ట బెట్టుకున్న సముద్రం ఏమీ తెలియని నంగనాచిలా అనిపించింది. సముద్రంమీద పట్టరాని కోపం వచ్చింది. ఉన్నపాళంగా ఇంకిపోతే బాగుండుననిపించింది

నిన్నటి సంఘటన తలుచుకొంటుంటే తెరలు తెరలుగా దుఃఖం క్రమ్ముకొచ్చింది ఆఖరిసారిగా 'కంయ్ కంయ్'' మని అరిచింది పాపం ఎంత బాధ పడిందో— కళ్ళ వెంట నీరు జల జల రాలింది ఆ అరుపులో 'చిన్న బాబూ నేను వెళిపోతున్నాను. నేను ఊరకుక్కని నా కోసం మీరు నాన్నగారితో తిట్లు తినకండి సెలవ్' అనే భావన రాజా పసి హృదయంలో మెదిలింది.

చేత్తో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు.

రంగారావు ఓదారుస్తూ ''ఊరుకో రాజా, పోతే పోయింది. ఊర కుక్క, దాని కోసం ఇంతగా ఇదయిపోవాలా? ఈసారి మంచి జాతి కుక్కని బెంగుళూరు నించి తెప్పిస్తానులే. పెంచుకుందాం'' అన్నాడు.

ఈ మాట వినేసరికి రాజా త్రాచు పాములా లేచాడు ''నాకొద్దు నాకు జాతి కుక్కొద్దు నాకు జాకీయే కావాలి ... దాన్ని మీరంతా కలిపి చంపేశారు, నువ్వు ప్రెసిడెంటు, వాడి జాతి కుక్క—మీరు అందరూ మీరు మీరు .మీరు '' అంటూ ఒళ్ళు తెలియని కోపంతో, పళ్ళు బిగబట్టి, పిడికిలి బిగించుకుంటూ దెయ్యం పట్టినట్లు ఊగిపోతూ చేతికందిన ఫ్లవర్ వాజ్‌తో గోడకి అమర్చిన అద్దాన్ని పగల గొట్టేశాడు. అది గళ్లున పగిలిపోయిముక్క ముక్కలై గదంతా తుళ్ళిపోయింది

తరతమాల్లో తేరుకొని తనకున్నంత అహం తన కొడుక్కి వుంది. ఫరవాలేదు పెద్దయితే తన పేరు నిలబెట్టగలడను కుంటూ బయటకు వచ్చేశాడు మిష్టర్ రంగారావు.

సముద్రపొద్దున ఎక్కడో కొట్టు కొచ్చిన కుక్క శవాన్ని పీక్కు తినడానికి రాబందులు గుంపులు గుంపులుగా దిగుతున్నాయి. •



# విదూషకుడివల్ల విప్లవం రాదు!



డా॥ సి. నారాయణరెడ్డి

అరిస్తే విప్లవంరాదు
తోటివాణ్ని
కరిస్తే విప్లవం రాదు
వస్తుంది విప్లవం
మార్క్సులాంటి మహర్షి బుర్రలోనుంచి
నవీన బలరాముని నాగలి కర్రలోనుంచి
శ్రమజీవుల నెత్తుటి మంటలోనుంచి
యువజనుల కుత్తుక గంటలోనుంచి

నాయకుడనుకున్న వాడు విదూషకుడై
నానా వేషాలు వేస్తుంటే
సారధి అనుకున్నవాడు శల్యుడై
సందుల్లోకి దారితీస్తుంటే
కథావస్తువు సహించదు
ఘంటాపథం క్షమించదు

చిచ్చుబుడ్డిలా పేలితే సరిపోదు
శివుని ఫాలాక్షిగా మారాలి
అక్రమాలను వేయిముక్కలుగా నరికే
చక్రాయుధంగా రూపుదిద్దుకోవాలి
అంతేకాని
లేనిపోని
గంగిరెద్దు బొంతలతో
బహురూపుల వింతలతో
వెకిలి వెకిలి యికిలింతలతో
వెర్రిమొర్రి సకిలింతలతో
చెమక్కులతో దుబుదుక్కులతో
గారడీడు మోటపించే మొక్కులతో
వినోదం పుడుతుంది గాని
విప్లవం కాదు
వంత ఏర్పడుతుంది గాని
సముద్యమం కాదు.



ఇదిగో ఒక నిరపాయమైన తలనొప్పి బిళ్ల!



# అవేదన్®

ఆశ్చర్యకరమైన ఎపెప్ గలది

(ఎన్-అసిటిల్-పి-అమినోఫెనాల్)



తలనొప్పి బిళ్లను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని సార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించేరు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది ఎందుకంటె, దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది అవేదన్‌తో చికాకైన చెడు ఫలితములు కలుగవు దానితో ఉపశమనము కలుగుతుంది—త్వరగా మరియు నిశ్చయముగా

కనుక తలనొప్పిని పోగొట్టుకోండి—నిరపాయముగా

జలుబు, ఫ్లూ, యితర నొప్పులు కూడ దీనితో పోతాయి

ఎపెప్‌గల అవేదన్‌ను వాడండి

**2 బిళ్లలు 15 పైసలు**

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి, జలుబు ఫ్లూలకు నిరపాయమైన, నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది




SQUIBB® SARABHAI CHEMICALS

® ఇ ఆర్ స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నము దీని లైసెన్సుదారు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్

Shilpi HPMA 37A/70 TEL



మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"అమ్మా! ఆ రోజు చూచి వెళ్ళిన వారా? అని అడిగింది.

"వాళ్ళ ముఖం' వాళ్ళు తప్ప ప్రపంచములో ధనవంతులే లేరా? అలా మొద్దులా నిలబడతావేమే? వచ్చి చూడు"

ఈసారి ఉరిమినట్టే మాట్లాడింది.

"నెమ్మదిగా చెప్పరాదు అదెప్పుడయినా దుస్తులు యెన్నిక చేపిందటే? నేను ఎన్నుకుంటాను.

"మొత్తం యెన్ని చీరలు?'' కుతూహలంగా అడిగింది శశి.

"పది యెన్నుకో. ,యింకా యెక్కువ

తీసినా అడిగేవారు లేరమకో. కొత్త ఫ్యాషనువి వచ్చినప్పుడల్లా కొనవచ్చులే. త్వరగా తెమల్చండి. ఆ నారింజరంగు చీర నాకు నచ్చింది "

"అమ్మా! యింతకీ పెళ్ళి కొడుకు గురించి చెప్పవేమే? ఏం పని చేస్తాడు?"

"పని చెయ్యవల్సిన ఖర్మ అతనికేం పట్టలేదు నల్గురి చేత చేయించుకుంటాడు మాటలు చాలుగాని త్వరగా తెముల్చు. నా కోరిక నెరవేరి నువ్వా ఆ యింటి కోడలివే అయితే అడిగేదేముంది?" అన్నది సంబరంగా. తన పెళ్ళి సంగతి రాగానే గంభీరంగా మారిపోయి చీరలు చూడటం మొదలు పెట్టింది. సుశీల బుర్రనిండా ప్రశ్నలే! వాటికి సమాధానాలు యెవరు చెప్తారు? ఆమెకు ఒకే ఒక వ్యక్తి కనిపించాడు.

అందరు నిద్ర పోయాక దోసెపిండి రుబ్బింది. వంటింట్లో లైటు ఆర్పి బయటి కొచ్చే సరికి శశి పిల్లిలా అడుగు లేస్తూ వెళుతుంది. "శశీ!" ఆశ్చర్యంగా చూచింది,

"ఉష్!" అంటూ ప్రక్క గదివైపు చూపింది ఉమాపతి క్రింది గదిలో పడుకున్నాడు. అతని గదిలో లైటు వెలుగుతూంది. అడుగుతో అడుగు వేసుకుంటూ వెళ్ళి నెమ్మదిగా తలుపులు తీసుకుని వెళ్ళిపోయింది. ఇదిలా సాగితే యెలా శశి గతి ఏమవుతుంది? యెలాగైనా ఆ విషయం పెద్దలకు తెలియజేయటం తన విధిగా భావించింది సుశీల. నెమ్మదిగా ఉమాపతి గదిలోకి వెళ్ళింది.

"మామయ్యా!"

"యెవరూ సుశీలా? ఏమ్మా?" లేచి కూర్చున్నాడు తన పెళ్ళి వివరాలు అడుగడానికే వచ్చిందని తెలుసు. ఏం చెప్పాలా అని తిక, మక పడసాగేడు.

"మామయ్యా, ఒక్క విషయం మీతో చెప్తాను మీరు నా పేరు బయట పెట్టకుండా పరిస్థితి చక్కబెట్టండి. చెప్పొద్దని ప్రయత్నించాను. కాని నిండు జీవితం నిలువునా కూలిపోతుంటే చూడలేక పోతున్నాను " ఆగింది ఊపిరి పీల్చుకోవటానికి

"అసలు సంగతేమిటమ్మా? నీకేం భయం లేదు చెప్పు. ఈ యింట్లో దేనికయినా భయపడే వాళ్ళమంటే మనిద్దరమే. మనము భయం విడిచి పెట్టాలి! లేకుంటే బ్రతుకలేం." భయపడుతూ మెల్లని స్వరాన శశి విషయం చెప్పింది "ఇప్పుడు వెళ్ళింది మామయ్యా. అతనెవరో వీధి చివరనుంటాడు. స్కూటరుంది ఈ విషయము బయట పెడితే చంపుతానంది "

"యెంతకు తెగించారు! మొదటి రోజే చెప్పాల్సింది సుశీ! వాళ్ళను అని లాభం లేదమ్మా లోపము వాలోనే ఉంది'

సీరియల్

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును





ఫోస్‌ఫోమిన్

- శక్తిని పెంపొందించును.
- ఆకలిని అధికము చేయును.
- సహన శక్తిని హెచ్చించును.
- శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును






ఫోస్‌ఫోమిన్.
ఆకుపచ్చని పండ్ల రుచిగల
విటమిన్ టానిక్

QUIBB
ARABHAI CHEMICALS

Shilpi HPMA 36A/70 TEL

రెండు చేతులతో నెత్తి పట్టుకున్నాడు ఉమాపతి. "మామయ్యా!"

"సుశీ! నువ్వే మదుగుతావో నాకు తెలుసమ్మా! ఆ విషయములో నాకు కూడా ఏం తెలియదు వరుడు రెండో సంబంధం పెళ్ళి కుమారుడని తెలుసు వెళ్ళు" అన్నాడు బొంగురు గొంతుకతో.

"శశితో నేను చెప్పినట్టు చెప్పొద్దు మామయ్యా." దీనంగా చూచింది. ఉమాపతి ఆ పిల్ల చేతిని నిమిరి "అలాగే తల్లి. వెళ్ళి పడుకో." కూతుర్ని యెలా మందలించాలా అని ఆలోచించ సాగేడు పరిస్థితులు తల్చుకుంటే సంసారం మీదే విరక్తి కలుగ సాగినది.

దొర్లి దొర్లి యెప్పుడో నిద్ర పోయాడు. బయట గుసగుసలు అతన్ని మేలుకొలిపాయి, లైటు వెయ్యకనే తలుపు వద్దకు వచ్చి ఆగాడు. హాల్లో మందంగా వెలిగే లైటు కాంతిలో నలిగిన రోజా పుష్పంలా ఉంది శశి. చేతికున్న రేడియం వాచి చూచాడు. మూడున్నర చూపుతుంది అతని హృదయం మండి పోయింది, "యెవరదీ?" అని బయటకు వచ్చాడు. రెండు నిమిషాలు తెల్లబోయింది శశి. వెంటనే జవాబు చెప్పింది. "నేను నాన్నా! పరీక్షలు దగ్గర కొస్తున్నాయి కదూ! చదువు దామని లేచాను. ఇంకా గంట నాలుగు కాలేదు. వస్తా." త్వరగా మేడమీదికి వెళ్ళిపోయింది.

ఇమామ్ ఇంటికి వెళ్ళడానికి అనుమతి అడిగాడు. ఉమాపతి అతన్ని పిలిచి తన క్యాంప్ కాట్ వరండాలో వెయ్యమన్నాడు. ఇమామ్ రెండు నిమిషాల్లో ఆ పని పూర్తి జేశాడు.

'యెవరన్నా వ్యాపారానికి సంబంధించిన వారొస్తున్నారా?'' బయటి ఊళ్ళ నుండి వచ్చిన వారికి వరండాలో పక్క ఏర్పాటుచెయ్యటం పరిపాటి ఆ యింట్లో.

'ఏమిటి? అతిధులా లేదు. శివరాత్రి దాటక మునుపే ఉక్క మొదలయింది. బయట పడుకుందామని? గదిలో నిద్ర రావటం లేదు '

'డాడీ'' శశి పిలిచింది. ఆ యింట్లో పిల్లలు 'డాడీ' అని పిలవమని తల్లి బలవంతం చేసింది. పిల్లలు తండ్రిని లోబర్చుకోవలసినప్పుడు మాత్రమే డాడీ అని ముద్దుగా పిలుస్తారు.

"మీరు బయటి వరండాలో పడుకుంటారా? లారీలు. కార్లు ఒకటే రొద పైన పడుకోండి''

"పరవాలేదమ్మా. వయసు మళ్ళుతుంది పైకి. క్రిందికి తిరగటం చాత కావద్దూ?" అతని పీకలదాక వచ్చింది ఆవేశం. బలవంతాన అణచి పెట్టాడు.

రాత్రి పదకొండు దాటింది. ఆ రోజే సుశీల వడ్డాణం మోడల్ తయారయి వచ్చింది. ఆ విషయం భర్తతో చెబుదామని తను వరండాలోకి వచ్చింది. దుర్గమ్మ. దుర్గమ్మ సంబరంగా చెప్పే కబుర్లు వినటం లేదు అతను. వీధిలోకి

చూస్తూ పడుకున్నాడు వరండాలో దీపం లేనందున అతను బయటి వారికి కనిపించడు. ఓ స్కూటరు వచ్చింది వీధి చివర ఆగింది. ఓయువకుడు దిగి వచ్చి ఇంటికి కొంచెము దూరంలో నిల్చుని సన్నగా ఈల వేశాడు కానేపు నిల్చుని మళ్లీ ఈల వేసాడు వీధిలో ఆ చివరనుండి ఈ చివరకు తిరిగాడు అలా అరగంట కష్టపడ్డా, రావల్సినవారు బయటికి రాలేదు ఈ సారి అతను దుర్గమ్మ దృష్టిని ఆకర్షించాడు "యెవడండీ రౌడీ వెధవ మనింటి చుట్టు పచార్లు చేస్తున్నాడేమిటి? లేచి అడగండి." అన్నది కాస్త బిగ్గరగానే, ఆలికిడి విని అతను వెళ్ళి తన స్కూటర్ వద్ద కూర్చున్నాడు. ఆమె లేచి వెళ్ళి వీధిలోకి చూచింది. వీధి లైట్ వెలుగులో స్పష్టంగా కనిపిస్తున్నాడు అతను. చూచారా! వాడెవడో మనింటి దిక్కే చూస్తూనాడు."

"చూస్తున్నాను" వెటకారం ధ్వనించింది అతని కంఠంలో.

"అంత నింపాదిగా అంటారేం? వెళ్ళి నిలదీసి అడగండి ..ఆ! అర్థం అవుతుంది దానికి షోకులు యెక్కువ అవుతున్నాయి అందరంపైన పడుకుంటామా?

దాని యిష్టా రాజ్యంగా ఉంది. దాన్ని పిలిచి నాలుగు అంటిస్తే నిజం చెప్తుంది'' ఆమె ఆవేశంగా లేచింది.

"కనకం! ఇంట్లో ఆ పిల్ల ఒకర్తే లేదు కదా! మన పిల్లలూ ఉన్నారు ..."

''మన పిల్లలనే అనుమానించే స్థితికి తెచ్చారా? నిజంగా అది మీకు మందో మాకో పెట్టింది. కనకదుర్గమ్మ కడుపున పుట్టిన బిడ్డలకు కడజాతి బుద్ధులు వస్తాయా?''

"ఇది ఇల్లు కాదు, వీధి భా స్త నెమ్మదిగా మాట్లాడు, యెవరయింది తెలుస్తుందిలే.'' ఆమె ఆలోచనలో పడింది. మౌనంగా అరగంట గడిచింది లోపలి నుండి మాటలు సన్నగా ఏడ్పు వినిపించాయి. వినమన్నట్టు సైగజేశాడు భార్యకు " .చెప్పు నువ్వు నాన్నకేం చెప్పావు' మాట్లాడవేం?''

"శశీ! నువ్వు నాకంటే పెద్దదానవు కొట్టినా, గిల్లినా బాధ లేదు. నన్ను అపార్థం చేసుకుంటున్నావు."

"అబ్బో! దొంగ కబుర్లు. అందుకే నీ లాంటి దానిపై జాలి చూపవద్దంటుంది అమ్మ. నిన్ను నమ్మడం నాది బుద్ధి తక్కువ. శంకర్ ఏమనుకున్నాడో'' బాధగా ఉంది శశి గొంతు.

"అంత దొంగచాటు వ్యవహారం దేనికి? నాన్నతో చెప్పి వివాహము చేసుకుంటే, ." సుశీలదే కావచ్చు చెంప చెళ్లు మన్నది. "డర్టీ క్రీచర్! నాకు నీతులు చెప్తుందట అమ్మతో చెప్పి తాట వలపించేస్తానుండు '' మేడ మెట్లు యెక్కేవ చప్పుడు వినిపించినది. ప్రేమ గుడ్డిది అంటారు ప్రేమ కాదు. కామము గుడ్డిది. ఆ గుడ్డితనంలో యెటు పయనిస్తుంది తెలుసుకోలేరు మనుషులు.

"మన శశా! అది ఇంతకు తెగించినదా? ఏమండి మిమ్మల్నే?'' భర్తను కుదుపసాగింది దుర్గమ్మ.

మన శశే. చాలా నాళ్ళనుండి జరుగుతుందీ తతంగం నోరు విప్పితే నీతో చిక్కు ''

'బాగుంది అన్నింటికి నన్నే అంటారేమిటి ' అర్ధరాత్రివరకు తిరిగి వస్తే ఈ దరిద్రపుది తలుపు తీసిందా' మొదట దీని అంతు తేలుస్తాను'' ఆవేశంగా లేచింది,

''నువ్విలా ఒకరి తప్పు ఒకరిమీద రుద్దే యింతవరకు తెచ్చావు పరిస్థితులు సుశీల ఈ యింట్లో పనిమనిషి యెవరేం చెప్పినా చెయ్యాల్సిందే నేను వరండాలో పడుకున్నానని నీ కూతురు కొట్టింది, కూతురు బయట తిరుగుతుందని నువ్వు కొట్టు మధ్య ఆ పిల్ల చచ్చిపోతుంది ''

''అయితే శశినే అడుగుతాను. నాకీ చాటు, మాటు వ్యవహారాలు నాన్చుడు వేషాలు గిట్టవు.'' యెక్కడలేని శక్తిని కూడదీసుకుని రెండేసి మెట్లు యెక్కుతూ పైకి వెళ్ళింది తలుపులు వేసి వెనుకాలే ఉమాపతి వెళ్ళాడు. దుర్గమ్మ కూతురిపై నుండి దుప్పటి తొలగించి, చెయ్యి పట్టి




లాగింది. ఒక ఉదుటున లేచి కూర్చుంది శశి. ఆ చెంపా ఈ చెంపా వాయించింది, 'ఏమే! యెవడే వాడు చెప్పవే? నా కడుపున చెడ బుట్టావేమే! పాపిష్టిదానా, చెప్పు! యెవడు వాడు ? యెన్నాళ్ళ నుండి సాగుతుందీ భాగవతం?'' హుంకరించింది,

''యెవరమ్మా? నువ్వేం మాట్లాడుతున్నావు?'' చెంపలు తడుముకుంటూ అమాయకత నటించబోయింది శశి. యెవరి నెత్తినో రుద్దుదామని చూచిన తప్పు తన కూతురి వంకే ఉంది, తన గౌరవాన్ని పవాలు చేయటం సహించలేకపోయింది దుర్గమ్మ. జుట్టు పట్టుకు వంచి వీపుమీద వాల్గు గుద్దులు గుద్దింది ''యెంత నంగనాచివే. చెప్పు అతనెవరే? ' అపర కాళిలా నిల్చుంది. ''శశీ! చదువుకున్నవారు సంస్కారవంతులు అని మిమ్మల్ని స్వేచ్ఛగా తిరగనిచ్చాము అందుకు ఇదా ఫలితం? శశీ! అంతా నాకు తెలుసు. అతనెవరో చెప్పు, కాళ్లు పట్టుకుని కన్యాదానం చేస్తాము'' ఉమాపతి అడిగాడు శశి దాచి ప్రయోజనం లేదనుకుంది, కన్నీరు వత్తుకుని తన ప్రియుని వివరాలు చెప్పింది ''అన్నయ్య స్నేహితుడు అతని పేరు శంకర్ ద్రాక్ష తోటలున్నాయి రెండు సంవత్సరాలు ఆగితే తనే వచ్చి మిమ్మల్ని అడిగి వివాహం చేసుకుంటానన్నాడు అంత వరకు మా స్నేహం బయటపెట్టవద్దన్నాడు. చాలా ధనవంతుడు '' అన్నది.

''రోజూ నువ్వు వెళ్లేది అతని తోటలోకేనా ?''

''అవును, ' అన్నది కళ్ళు దించుకుని. దుర్గమ్మ మళ్లీ చెయ్యి యెత్తింది. ఉమాపతి అడ్డుకున్నాడు.

"అర్ధరాత్రి గొడవ దేనికి? రేపు ఆలోచించి అతన్ని కలుసుకుందాము. శశీ! వివాహము అయ్యేవరకు అతన్ని కలుసుకోవడానికి వీలులేదు. అతను ఒప్పుకుంటే అక్కయ్యది కాకపోయినా నీ పెళ్లి చేస్తాము. నేను చెప్పిన విషయం గుర్తుంచుకో" ఆజ్ఞాపించి భార్యను తీసుకుని బయటికి వచ్చేశాడు దుర్గమ్మ ఏమో మాట్లాడబోయింది. "నీ ఆంతర్యం తెలుసు దుర్గా. అలా పిల్లలను నెత్తిన యెత్తుకునే కొంపకు నిప్పు పెట్టడానికి సిద్ధం చేశావు ఇప్పటికైనా కళ్ళు తెరువు" విసురుగా చెప్పి తన గదిలోకి వెళ్ళాడు. దుర్గమ్మ మాట్లాడలేక, అక్కడే గోడకు చేరబడి కూర్చుంది.

ఉదయము ఫలహారం కాగానే వెంకట్ దుస్తులేసుకుని బయటికి వెళ్ళడానికి సిద్ధం అయ్యాడు. "వెంకన్నా నాన్న పిలుస్తున్నారు" ప్రేమవార్త మోసుకు వచ్చింది వెంకట్ గుండెలు టక, టక కొట్టుకో సాగేయి నిన్న బ్యాంకులో కట్టమన్న డబ్బు తను పేకాటలో ఫోగొట్టుకున్నాడు ఈ రోజు పదిలో మొదలుపెట్టి వందలు గెలవాలని ఉంది, బ్యాంక్‌వాళ్లిచ్చిన రసీదు అడుగడుకదా! అమ్మ క్రిందనే ఉంటే బాగుండును అనుకుంటూ దిగాడు మేడ. భయపడుతూ తండ్రి గదిలో అడుగు పెట్టాడు. "రా వెంకట్ కూర్చో" ప్రేమగా పిలిచాడు తండ్రి కొడుకు పొంగిపోయాడు. వినయముగా తండ్రికెదురుగా కూర్చున్నాడు. "వెంకట్! శంకర్ అని నీకు స్నేహితుడున్నాడా? అతనే కులస్తుడు? అతని పూర్తి వివరాలు కావాలి" వెంకట్ తానేం చెప్తున్నాడో మరిచిపోయి అంతా నిజం చెప్పేశాడు. "అతని కులం యేమిటో తెలియదు నాన్నా. ద్రాక్ష తోట యజమాని మురారిలాల్ వద్ద గుమస్తాగా ఉంటున్నాడు. పేకాటలో అందె వేసిన చెయ్యి వాడు రంగములో ఉన్నాడంటే అందరి జేబులు ఖాళీ. చదివింది థర్డు పారమ్ అయినా, ఇంగ్లీషు భలేగా మాట్లాడుతాడు ఎమ్. ఏ లిటరేచరు వాళ్లు చిత్తు కావల్సిందే"

"నీకు అతనితో పరిచయమెలా అయిందిరా?" ఈసారి ప్రశ్న కటువుగా ఉంది

"నాకా? నాకు అతను మామూలుగానే పరిచయమయ్యాడు. అంటే . ఐ మీన్! ద్రాక్ష తోటలు చూచి అనుభవం సంపాదించాలని అప్పుడప్పుడు వెళ్తానుకదా! మన గూడెం పొలంలో మనమూ వేద్దాము సంవత్సరానికి లక్షలు సంపాదించవచ్చు."

"సరే. నువ్వు వెళ్లు" బ్రతుకు జీవుడా అని బయటపడ్డాడు వెంకట్. ఉమాపతి డ్రైవరును వద్దని తనే స్వయంగా కారు నడుపుతూ ద్రాక్ష తోటలవద్దకు వెళ్ళాడు శంకర్ గురించి వాకబు చేశాడు. అక్కడ కావలి తాత వచ్చాడు. "అతని చంటి పిల్లకు జ్వరంగా ఉందని కబురు వస్తే రాత్రి వెళ్ళిపోయాడు బాబూ. సాయంత్రం వరకు రాకపోవచ్చు." ఉమాపతి బుర్ర తిరిగిపోయినది. "అతనికి పెళ్లి అయిందా?!

నూతిలోంచి మాట్లాడినట్టుంది.

'అదేమిటి బాబుగారూ? ముగ్గురు పిల్లలు కూడాను ఇతనే చిల్లర తిర్గుడు తిరుగుతాడు. ఆయమ్మ మంచిది.'' అతని వద్ద శంకర్ అడ్రసు తీసుకుని సీరసంగా కార్లో కూలబడ్డాడు ఆ చిన్న పల్లెలో శంకర్ అడ్రసు కనుక్కోవడం ఏమంత కష్టం కాలేదు. ఒక పెంకుటిల్లు ముందు కారాగినది వెళ్లి తలుపు తట్టాడు ఓ యిరవై సంవత్సరాల యువతి తలుపు తీసింది.

''యెవరు కావాలండి?'' ప్రక్కకు తొలిగి అడిగినది

''శంకర్ ఉన్నాడా అమ్మా?'' మాలి చెప్పినది నిజమే యింట్లో పిల్లలు ఆడు కుంటున్నారు.

''ఇప్పుడే వెళి పోయారండి మీరెవరు రండి కూర్చోండి'' వెళ్ళి కుర్చీలో కూర్చు న్నాడు. ఇల్లు శుభ్రంగా ఉన్నా లేమి తనాన్ని దాచలేకపోతుంది ''మా అబ్బాయి శంకర్ స్నేహితులమ్మా.''

''మీ అబ్బాయి వద్ద డబ్బేమయినా తెచ్చారండీ' దొంక్క దొంక్క వీరి స్నేహమే దొరకిందా?'

''డబ్బు తేలేదమ్మా మాకు తెలిసిన అమ్మాయిని వివాహము చేసుకుంటానని చెప్పారట. నేను వా ... చేస్తే అతనికి వివాహమయినట్టు తెల్సిందమ్మా. నిజం కనుక్కు పోదామని వచ్చాను'' తన కూతురేనని చెప్పుకోడ నికి నామోషీ అని పించింది ఉమాపతికి,

''అయ్యో! యెంతకు తెగించారు! ఒక పేకాట అప్పులు చేయటమే ననుకున్నాను అమ్మాయిలను మోసం చెయ్యటం కూడా నేర్చారా? అయిదు సంవత్సరాల క్రితం వారి అందానికి అబద్ధాలకు మోసపోయాను బాబుగారూ! ఇదిగో ముగ్గురు పిల్లలు వారిని చంపలేక రాత్రి బడిలో పనిచేస్తు న్నాను. నిన్న చిన్నమ్మాయి ప్రాణం మీదికి వచ్చిందని చెప్పిపంపితే వచ్చారు, ఇరవై రూపాయలు నాకిచ్చి వెళ్ళిపోయారు' అమె కంటినుండి నీరు జలా. జలా రాలింది, మనిషి కష్టాలు పరాకష్టాన్ని అందుకుంటేనే పరాయివారి ముందు వెల్లడి చేస్తారు ఆమెను చూడగానే ఎంత దీన స్థితిలో ఉందో తెలుసుకున్నాడు. 'ధైర్యంగా నీ పిల్లలను పెంచుకో తల్లీ చేయి జేబులో పెట్టి ఓ విజిటింగ్ కార్డు తీసి దానిమీద నాల్గుపంక్తులు రాసి ఆమె కిచ్చాడు. ''ఇది డాక్టరుకు చూపించు పాపకు మందులు యిస్తాడు. డబ్బు విషయం బెంగపెట్టుకోకు. అతను తీను కోడు వస్తానమ్మా''

''కొంచెము నిమ్మరసం ఇస్తానుండండి బాబుగారూ'' లోపలికి పోబోయింది.

''వద్దమ్మా ఇంకోసారి వస్తానుగా'' త్వరగా బయటికి వచ్చి కార్లో కూర్చుని స్టార్టు చేశాడు.

ఉమాపతి చెప్పిన విషయాలు విని కనకదుర్గమ్మ నెత్తి బాధుకుంది. శశి నోట

మాట లేక కూర్చుండి పోయినది. "ఇకనైనా బుద్ధితెచ్చుకో శశీ! త్వరగా మేలుకున్నాము. యింకా కొన్నాళ్ళయితే ఎన్ని అఘాయిత్యాలు జరిగేవో. జాగ్రత్తగా చదువు" తండ్రిగా హితవు చెప్పాడు.

"ఇంత తెగించిన మొగవాళ్ళుంటారండి. అవ్వ? ముగ్గురు పిల్లలను పెట్టుకుని పెళ్ళికాలేదని బొంకుతాడా? పోలీసులకు పట్టిస్తే రోగం కుదురుతుంది"

"యెవరిదే? మనది కుదురుతుంది. చెప్పేవాడు యెన్నో చెప్తాడు తన అవసరానికి నమ్మే ఆడవారి తెలివితేటలు ఏమయినాయి? ఇంగ్లీష్ సినిమాలు చూచి హీరోయిన్లలాగే చేస్తామంటే యెలా? వారి సంస్కృతి వేరు ఒకమ్మాయికి యెంత మంది మొగ స్నేహితులుంటే అంత గొప్ప. ఒకడితో తిరిగి యింకొకడిని పెళ్ళి చేసుకున్నా వారిని యెవరు ఏమి అనరు వారి సాంఘిక మర్యాదలు వేరు. మనవి వేరు. ఇక గుట్టు చప్పుడుకాకుండా మసలుకోండి ఈయేడు ప్రసన్నని, వచ్చేయేడు దీనిని చేద్దాము పెళ్ళి ప్రయత్నిస్తాను యెక్కడయినా వరుడు కుదిరితే ఇద్దరిది ఒకేసారి చేస్తాను"

"ప్రసన్నకి చూడండి చాలు. ఇప్పుడు సుశీలనిచ్చే ఆతని కొడుకు యేదో పెద్ద చదువే చదువుతున్నాడట నేను చెబ్తే అతను కాదనడు. శశిని ఆ యింట్లోకే యిద్దాము" భార్యవంక ఒక్కసారి చూచి గదిలోంచి వెళ్ళిపోయాడు ఉమాపతి

* * *

సుశీల వివాహము వరుని ఇంట్లో చేసేటట్టు నిశ్చయించారు. శుభలేఖలు అచ్చు వేయించలేదు అనసూయమ్మ వరుని వివరాలు తెలుసుకోడానికి యెంత ప్రయత్నించినా మాటలు దాటివేసింది. నేరుగా అడిగితే, దుర్గమ్మ కోపానికి అంతులేదు. "యెవరో ఒకరు ఈ వీధిలో వారికేం పోయేకాలమో, మంది విషయాలే కావాలి, ఇలాంటి పేదనే పెళ్ళికూడా యిక్కడ చెయ్యటంలేదు. యెవరిహద్దుల్లో వారుండాలి" అభిమానముగల వారికామాటలు చాలవా? అనసూయమ్మ చివాలున లేచి వెళ్ళిపోయింది. చేరవల్సిన సామాన్లు కారులో వరుని యిల్లు చేర్చారు. ఇక తాళాలు పెట్టి బయలుదేరటమే తరువాయి. ఉమాపతి తన పెట్టె, బేడా సర్దుకోవటం మొదలుపెట్టాడు.

"యెక్కడికండీ! పెళ్ళి రెండురోజులే ఉంది" ఆశ్చర్యంగా ప్రశ్నించింది దుర్గమ్మ

"సుశీల పెళ్ళి విషయంలో కలుగజేసుకోనని మాటిచ్చానుగాని, పెళ్ళికుంటానని అనలేదుగా అదిలాబాద్‌లో కలప చవకగా వస్తుందట వెళ్తున్నాను ఆమె వైపు చూడకనే జవాబు చెప్పాడు.

"యెవరిని సాధించాలని? యిక్కడ కన్యాదానం యెవరు చేస్తారు?" కోపంతో ముఖం యెఱ్ఱబడినది. "మనము కన్యాదానం చేస్తే జరిగేదేమిలేదు వైదిక్ పద్ధతిన పెళ్ళి చెయ్య అతను కారుకూడావద్దని

# మళ్లీ వచ్చింది!

# కస్తూర్

## టాయిలెట్ సబ్బు






రోజంతా ఆహ్లాదకరంగా మీరు సువాసనలు విరజిమ్మేటట్లు చేస్తుంది. ఓషధీకరణం అయిన లానోలిన్ చేరివున్న కస్తూర్ చర్మంలోపలికల్లా పోయిన శరీరాన్ని పరిశుభ్రంగాను, ఆరోగ్యవంతంగాను వుంచుతుంది.

రెమీ® వారి మరొక మేలిరకం ఉత్పత్తి

Sarath RKS | TEL

రిక్షాని పిలిపించుకున్నాడు. "మరే! ఈ సంబడమేమిటో! అయ్యగారు లేకుంటే పెళ్ళి ఆగుతుందట? ఆ పట్టుదల ఏమిటో నేను చూస్తాను" తల యెగరేసుకుంటూ వెళ్ళిపోయింది

"సుశీ! వెళ్ళొస్తాను." ఉమాపతి అలా యెందుకు వెళ్ళిపోతున్నాడో అర్థంకాలేదు. వచ్చి అతని పాదాలకు నమస్కరించింది. "యెందుకమ్మా యింకా ఈ గౌరవం? భగవంతుడు తప్ప నీకు బంధువులు లేరు తల్లీ అతడే నిన్ను రక్షించాలి" త్వరగా వెళ్ళి రిక్షాలో కూర్చున్నాడు రిక్షా కదిలింది అతను కళ్ళుతుడుచుకోవటం కనిపించింది.

మొదటి ట్రిప్పులో ఆడపిల్లలు ఇమామ్ వెళ్ళారు. కార్లో రెండవసారి దుర్గమ్మ, సుశీల. వెంకట్, వేణు బయలు దేరినారు. బయలుదేరేముందు ధైర్యంచేసి అనసూయమ్మకు చెప్పి రావడానికివెళ్ళింది

"అక్కడ సమయము మించిపోతుంది. ఆరుగంటలకు వెళ్ళికూతుర్ని చెయ్యాలి" దుర్గమ్మ అరుస్తున్నా లెక్కచెయ్యలేదు

"పిన్నీ" ఆమె హృదయంతో తల దాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది. అన సూయ కూడా కన్నీరుకార్చింది.

"సుశీ! నాకంతా అయోమయంగా ఉందమ్మా. మీ బాబాయి కూడా సమ యానికి లేరు."

"అన్నింటికీ సిద్దమయ్యే వెడుతున్నాను పిన్నీ యింతకంటే నరకం మరెక్కడా ఉంటదులే."

"పరిస్థితులు అనుకూలంగా లేకపోతే యేదయినా అఘాయిత్యము చేసేవు? ఈ దేశంలో ఆడదిగా పుట్టటమే ఓ శాపం. అందునా తల్లి తండ్రిని కోల్పోవటం అంత దారుణం మరొకటిలేదు తల్లీ. ధైర్యంగా ఉండు" కన్నీరు వత్తి, పీట మీద కూర్చోపెట్టి, సిల్కుచీర, రవికల గుడ్డ చేతిలో పెట్టింది. వంగి అనసూయకు నమస్కరించినది. 'కలకాలం పిల్లాపాపతో సుఖంగా ఉండు' లేవనెత్తి హృదయానికి హత్తుకుని పసిపిల్లలా విలపించింది.బయట కారు హార్న్ వినిపించినది 'పద' ఇద్దరూ బయటికి వచ్చారు. విచ్చిన గులాబిత్రుంచి సుశీల తలలో పెట్టి కారువరకు వచ్చి సాగనంపినది. దుర్గమ్మ మూతి తిప్పుకుంది 'పోనియ్యరా వెంకట్' అన్నది. "అమ్మా! సుశీ! ఏ అఘాయిత్యము చెయ్యకు." కారు కదిలింది 'దీనికేం పొయ్యేకాలం? పెళ్ళి చేసుకోడానికి వెళ్తుంటే అఘా యిత్యము చెయ్యకు' అంటుంది. ఓర్వలేని తనం, ఏళ్ళు రాగానే సరా?' కారు ఇల్లు చేరేవరకు సణుగుతూనేఉంది

వరుని గృహము పెద్ద మేడ. మేడ ముందు రకరకాల మొక్కలు పనివాళ్ళు తప్ప ఇతరులు యెవరూ కనిపించలేదు. ప్రసన్న, శశి. ప్రేమ యింటిని, యింటి లోని వస్తువులను చూస్తూ సంబరముగా తిరుగుతున్నారు సుశీల శూన్యమయిన హృదయముతో తమ సామాన్లు పెట్టిన గదిలో కూర్చున్నది. ఆరు గంటలకు




బ్రాహ్మడు వచ్చాడు సుశీలకు తలంటి పోసి కొత్తబట్టలు కట్టపెట్టింది దుర్గమ్మ బ్రాహ్మడు మంత్రాలు చదువుతూ అక్షింతలు వేశాడు కల్యాణ తిలకం దిద్ది, నగలు పెట్టింది ప్రసన్న "దుర్గమ్మగారూ! మళ్ళీ రేపు వచ్చే పని లేదుగా? యెల్లుండి ఆరు గంటలవరకు అందరూ సిద్ధంగా ఉండండి. చలపతిగారితో కూడా చెప్పాను

"చూడండి సిద్ధాంతిగారూ ఓ క్రొత్త బెడద వచ్చిపడినది మావారు తొందర పని మీద ఊరువెళ్ళారు వివాహము వైదీకుల పద్ధతిలో చేద్దాము.' సిద్ధాంతిగారు క్షణం ఆలోచించాడు "యెందుకమ్మా! లేనిపోని గొడవ! మాకు తెలిసిన దంపతులున్నారు ఇద్దరికి బట్టలుపెడితే చాలు కన్యాదానం చేస్తారు పిలుద్దాము" గొంతు తగ్గించాడు మీ కూతురా ఏమన్నానా! యెవరో దిక్కులేని పిల్లాయే ఏమంటారు?" వెకిలిగా నవ్వాడు

"ఏమంటాను? చాలా మంచిపని. రేపెళ్ళి బట్టలు తెస్తాను' సిద్ధాంతిగారు వెళ్ళిపోయారు రాత్రి పిండివంటలతో భోజనం ముగిసింది. అందరు పడుకుని నిద్రపోయారు అలవాటు ప్రకారం నాల్గింటికే మెలుకువ వచ్చింది సుశీలకు. పనేమిలేక చీకటిని చూస్తూ కూర్చుంది. హాల్లో అలికిడి వినిపించగానే దుర్గమ్మ లేచి బయటకి వెళ్ళింది సుశీల లేచి గుమ్మములోకి వచ్చి నిలబడింది. బేసిన్ వద్ద పళ్లు తీసి (కట్టుడివి) ముఖం కడు



కుంటున్నప్పుడు కనిపించాడు ఆ ప్రక్కనే పళ్లు తోముతూ దుర్గమ్మ నిలబడింది ఇద్దరూ దంతదావనము చాలించి వచ్చి హాల్లో మధ్య ఉన్న సోఫాలో కూర్చు న్నారు అతను పళ్ళ గడ్డ యెక్కించు కున్నాడు పని మనిషి కాఫీ తెచ్చినది ఇద్దరికి ఇచ్చింది "ఏమిటోనే దుర్గా! నాకు పెళ్ళి పెళ్లాం అంటే పెద్ద ఇష్టం లేదు మెడలు విరిచి ఒప్పించావు ఈ విషయం పిల్లలకు రాశాను. కోపం వచ్చినట్టుంది. ఈ వయసులో నాకేం సంబరం? ఈ పని వాళ్ల చేతి కూడుతిని జిహ్వ చచ్చి పోయింది"

"మీదేమంత పెద్ద వయసు? మీకంటే పెద్దవాళ్ళు పెళ్ళాడి హాయిగా సంసారాలు చేస్తున్నారు వంటా, పని వచ్చిన పిల్ల హాయిగా తిని తిరగండి ఒక్క మాట మామయ్యా!"

"నా దగ్గర సందేహ మెందుకే? చెప్పు" అన్నాడు రంగు వేసిన మీసాలు దువ్వుతూ

"ఎంత పెంచినా పరాయి పిల్లగదా! రేపు మీ పిల్లలు యెదురు తిరిగితే దాని గతి? నన్ను తిట్టుకుంటుంది దాని పేర ఇంతో అంతో రాస్తే" నసిగింది అతను చిన్నగా నవ్వాడు.

"గట్టిదానవులే మొదటే చెప్పాను కదా. ఈ మేడ, కారు, గోమారంవద్ద పొలం, మీ పిల్లకే, దానికి పిల్లలు పుడితే బ్యాంక్‌లో ఉన్న నగదు తనదే" సుశీల తల తిరిగిపోయింది తాత వయసులో ఉన్న అతను భర్తా? భగవాన్ ఏమిటీ పరీక్ష! నామీద దయలేదా తండ్రీ? ఏడుస్తూ ప్రక్కపై పడింది అరు గంటలకు లేప డానికి వచ్చింది దుర్గమ్మ "అత్తయ్యా! ఈ పెళ్లి నాకొద్దు" అమె రెండుకాళ్లు పట్టుకుని బావురుమంది సుశీల.

(సశేషం)

# ఆ రైలు ఇక రాదు

సుమన్



ఒగర్చుకొంటూ వచ్చి ఆగింది రైలు. పెట్టెల కడుపులోనుంచి నెట్టివేయబడుతున్నారు. కొంచంసేపు అంతా హడావిడి. పోర్టర్ల కేకలు-రిక్షావాళ్ళ అరుపులు....

నిశ్శబ్దాన్ని వికృతంగా హత్య చేస్తున్నాను.

జయమ్మ మనుషుల్ని తోసుకొంటూ కంగారుగా వేగంగా పెట్టెలకేసి వెళ్తోంది. మనుషుల ముఖాల్లోకి పరిశీలనగాచూస్తోంది వెతుక్కొంటూ. కొన్ని నిమిషాలు ప్లాట్ ఫారం కలియతిరిగిన తర్వాత పెట్టెల్లో వెతకసాగింది. ఆమె కళ్ళు చాల ఆత్రంగా, తొందరగా వెతికాయి. ఎక్కడా ఆమెకు కావలసిన వ్యక్తి దొరకలేదు.

ఆమె కళ్ళల్లో నిరాశ విసుగు చేరి సగం పంచుకొని ఒళ్ళు కప్పుకున్నాయి.

సేదతీరింది కాబోలు రైలు ఈసారి సంతోషంగా అరిచి ముందు కొంచం నెమ్మదిగా తరువాత వేగంగాదూసుకొంటూ దూరాన వంగిన మబ్బుల్లోకి దూసుకుపోయింది.

వెళ్తున్న ఆ బండివంక చాలసేపు చూస్తూ వుండిపోయింది జయమ్మ. తరువాత అమె కళ్ళు ఎరుపురంగు పులుముకున్నాయి. వెంటనే తెల్లటి నీటిచుక్కలు క్రింది రెప్పలను పొర్లుకొంటూ చితికిపోతూ జల జల రాలాయి.

నెమ్మదిగా నడిచి చెట్టుక్రింద సిమెంటు అరుగుమీద కూర్చుంది. అక్కడే వున్న పాతపెట్టెలో చింపిరిగుడ్డల్ని, పాతకాగితాలను అటుయిటు పిచ్చిగా తన ఒణుకుతున్న చేతులతో కదిలించసాగింది.

ఇలా నేను ప్రతిరోజూ చూస్తున్నాను. రైలు దూరాన కూయగానే జయమ్మ పరుగెత్తుకు రావటం. ఆదుర్దాగా ఆశగా ఎవరికోసమో వెతకటం - నిరాశపడి ఏడ్వటం ప్రతిరోజూ జరిగేదే ...

జయమ్మ ఎందుకిలా చేస్తోంది? నేను చాల రోజులనుంచి వేసుకొంటున్నప్రశ్న.

మళ్ళా జయమ్మకేసి చూశాను. బైరాగి కాబోలు ఏడుస్తున్న జయమ్మతో ఏమిటో చెప్తున్నాడు. బైరాగి బిచ్చగాడు. అప్పుడప్పుడు తను అడుక్కు వచ్చిన దాంట్లో కొంత జయమ్మకు పెడుతూవుంటాడు.

జయమ్మ పిచ్చిది. శరీరంమీద పీలికల గుడ్డలు వాటిచాటున మరీ పీలికల్లా ముడుతల గీతలు-తల చిందరవందరగా చెదరి అక్కడక్కడ యింత రాగి రంగు, మరి కొంత తెల్లరంగు పులుముకుంది.

ఆమె రోజూ ఆ రకంగా రైళ్ళు వెతకటం-ఆమె చేష్టలు, ఆమెనవ్వు, ఏడ్పు చూసి పిచ్చిదిగా పేరు పొందింది.

గుడ్లవల్లేరు స్టేషను పెద్దదేమి కాదు. చాల చిన్నది. కాని, వచ్చిపోయే ప్రతి రైలు యిక్కడ ఆగుతుంది.

అక్కడక్కడ ఎత్తుగా గుబురుగా పెరిగిన చెట్లు-వాటి మధ్య సన్నగా నిలువుగా పాతిన ఎలక్ట్రిక్ స్తంబాలు - మనుషులు కూర్చోటానికి వేసిన రాతి అరుగులు-ఓ చిన్న బంగళాపెంకు డాబా— దానిని ఆనుకొనే కాంటీన్ — ఇది రైలు స్టేషను. స్టేషనుకు రెండోపక్క ప్లాట్ ఫారం లేదు. లారీలు, బళ్ళు నడిచిన గోతులు లోతుగా వికృతంగా వుంటాయి

అక్కడక్కడ పెరిగిన పిచ్చిమొక్కలు. పడి కాళ్ళు చేతులు విరగొట్టుకున్న రాళ్ళు రెండో ప్రక్క స్టేషనుకు మిగిలినవి.

జయమ్మ ఏదో బిగ్గరగా అంటోంది. ఏమిటో అర్థంకావటంలేదు. కొంచంసేపు ఏవో కూనిరాగాలు తీసింది. తరువాత ఏడ్చింది. జుట్టు పీక్కుంది. తుప్పు పెట్టె లోని కాగితాలు చిందరవందరగా విసర సాగింది. బైరాగి ఆమెను పట్టుకొని కూర్చోపెడుతున్నాడు.

జయమ్మ బైరాగిని తోసి లేచి వెళ్ళి రైలు పట్టాలవంక చూడసాగింది.

* * *

రాత్రి పది దాటింది. చలిగాలి శరీరాన్ని తీవ్వమనిపించుతోంది. రైలు స్టేషనుకు వెళ్ళాలనిపించింది. వేళ్ళవరకు స్వెట్టర్ లాక్కుని తలచుట్టూ మఫ్లర్ చుట్టుకొని గదినుంచి బయలుదేరాను.

స్టేషనులో చెట్లమధ్య వెలుగుతున్న లైట్లచుట్టూ పురుగులు దాగుడుమూతలాడు తున్నాయి. చెట్లపైన చీకటి క్రింద లైట్ల వెలుగు అక్కడక్కడ చీకటి వెలుగులు కొట్టుకుని మిగిల్చిన ముక్కలు.

రావిచెట్టు క్రింద సిమెంటు అరుగుమీద జయమ్మ వుంది ప్రక్కనే బైరాగి కూర్చు న్నాడు. బైరాగి అన్నం గిన్నెలో పెట్టి పులుసుపోసి జయమ్మ ముందు పెట్టాడు. జయమ్మ ముందు అన్నంవంక పిచ్చిగా చూసింది. తరువాత కొద్దిగా నోట్లో పెట్టు కొని తింటూ అటుయిటు చూడసాగింది. ఆమె తింటూవుంటే బైరాగి కళ్ళల్లో ఏదో తృప్తి ఆక్రమించుకొంటోంది. నల్లగా వున్న అతని ముఖంలో వెలుగు కనబడు తోంది. బైరాగి రోజూ ఊళ్ళోఅడుక్కొని జయమ్మకు పెట్టి మిగిలింది తనుతింటాడు. నివాసం ఎండ, వాన చలుల క్రింద ఆ స్టేషనులోనే.

జయమ్మకు బైరాగి ఏమవుతాడో ఎవ రికీ తెలియదు. అడిగితే "ఏదో పిచ్చిది- నాలుగు మెతుకులు పెడితే పుణ్యమే కాని పాపంకాదుగా బాబయ్యా" అంటూ వుంటాడు. దానికి నాకు ఏమీ చుట్టరికం లేదు అంటూ వుంటాడు.

జయమ్మ అన్నం తిన్న తర్వాత ఆ గిన్నె తీసుకువెళ్ళి పంపుదగ్గర కడిగాడు. అందులోనే కాసిని నీళ్ళు తీసుకువచ్చి జయమ్మకు త్రాగించాడు. సిమెంట్ అరుగు మీద గుడ్డతో దుమ్ము దులిపాడు. జయమ్మ అక్కడ పడుకుంది. తన భుజంమీదవున్న పాత దుప్పటి జయమ్మమీద కప్పి నా దగ్గరగా వచ్చి అన్నాడు "ఏటి బాబయ్యా నిలబడిపోయినారు. పిచ్చిదంటే మీకు ధ్యాసగా వుందే."

"కాదు, బైరాగి ఏమీతోచక యిటు వచ్చాను."

"ఎటో పిచ్చిది బాబూ అట్టా చూస్తూ వుంటుంది వచ్చే రైలు పోయేరైలు-దాని ప్రాణం అట్టా పోవాల్సిందే."

'ఎవరికోసం చూస్తూ వుంటుంది బైరాగి' అడిగాను.

"పిచ్చిదిబాబూ-దాని చేష్టలు అంతే— ఎవరికోసం చూస్తుంది?" గొణిగినట్లుగా చెప్పాడు బైరాగి. అలా అనేటప్పుడు కళ్ళల్లో బాధ అలవోకగా తొంగిచూసింది. దానిని కనబడనీయకుండా తలదించుకొని చిరుగుల జేబులోనుంచి బీడీ తీసి నోట్లో పెట్టుకున్నాడు. నేను అగ్గిపెట్టె యిచ్చాను. బీడీ వెలిగించి పొగవదిలాడు.

పైన మంచు కురుస్తోంది కాబోలు బాగా చల్లబడిపోయింది. "వెళ్ళిపడుకోండి బాబూ పొద్దొయింది. నేనూతొంగుంటాను" అన్నాడు బైరాగి వెనుతిరుగుతూ.

చెట్టుక్రింద పడుకున్న జయమ్మ చలికి వణుకుతోంది. బైరాగి దుప్పటి సరిచేసి తను కొంచెం దూరంగా ముడుచుకొని పడుకున్నాడు.

నేను సిగరెట్ వెలిగించాను. ఆచలిలో సిగరెట్ చాలా వెచ్చగా హాయిగావుంది. ఆ సమయంలో పేదవులకు సిగరెట్ ఇచ్చే వేడి మరేదీ యివ్వలేదేమో.

ఆలోచించుకొంటూ గదికి బయలు దేరాను.

నేనుండే గది స్టేషనుకు చాలదగ్గర. నా గదిలోనుంచి స్టేషనును చూడగలను. రోజూ స్టేషనువంక చూడటం - జయమ్మ కోసం కళ్లు వెతకటం అలవాటుగా మారి పోయింది. జయమ్మ రైళ్ళు వెతకటం అలవాటుగా మారిపోయింది జయమ్మ రైళ్ళు వెతకటం గురించి నేను చాలా రకాలుగా అనుకునేవాడ్ని. భర్త వదిలి వెళ్ళిపోయి వుంటాడు. లేదా కొడుకు తల్లిని వదిలివేసి ఎక్కడికో పారిపోయి వుంటాడు. అందుకోసం మనసు చెదరి అలా వెతుకుతూ వుండివుంటుంది. ఇంకా ఎవరినన్నా బంధువుల్ని పోగొట్టుకుందేమో.

జయమ్మ పట్ల నాకు పూర్తిగా జాలి ఏర్పడింది. అప్పుడప్పుడు స్టేషనుకు వెళ్ళి నేను జయమ్మకు బిస్కట్లు. కాయలు. రొట్టెలు యిస్తూ వుండేవాడిని. జయమ్మ ఏమీ మాట్లాడేదికాదు. నేను యిచ్చేవి తీసు కొనేది. ఒక్కొక్కసారి కళ్ళనీళ్ళు నింపు కొని చూసేది. మరొకసారి నేనిచ్చినవాటిని తన పాత పెట్టెలో వేసి అటుయిటు చేతు లతో ఆకించుకూ వుండేది.

నేను అవి యిస్తున్నపుడు బైరాగి అంటూ వుండేవాడు "ఎందుకు బాబూ యివన్నీ."

అయినా నేను ఆగేవాడిని కాదు.

బైరాగి శ్రమను చూసి నేను చాలా ఆశ్చర్యపోయేవాడిని మరో బిచ్చకత్తె కోసం బైరాగి అడుక్కుని పోషించటం నిజంగా ఆశ్చర్యమే కల్గించుతుంది.

మనిషిపట్ల మరోమనిషికి ఏర్పడే సానుభూతి ఎంత అందమైనది.

పేవ్‌మెంట్లమీద కుంటుతూ నడిచే బిచ్చగాళ్ళ మధ్య అందమైన సానుభూతి- అందంగా వెలిగే తృప్తి ...

అవి ఈ దేశంలో ఎంతమంది లక్షాధి కారులు పొందుతున్నారు?

నా మనసులో తిరుగుతున్న ప్రశ్న



# ఫొటోగ్రఫీలో వినోదం కోసం
# ఆగ్ఫా క్లిక్ III

అభ్యాసానికి, అనుదిన వినియోగానికి అత్యుత్తమం

- ఉపయోగించుట తేలిక ఎడ్జెస్ట్‌మెంట్లు అవసరం లేదు.
- ప్రతి 120 రోల్‌తో, 12 పెద్ద సైజు (6 x 6 సెమీ) చిత్రాలు తీయవచ్చు
- ఎవర్-రెడీ కేస్, పోర్ట్రెయిట్ లెన్సు, మరియు ఫ్లాష్ గన్ అదనపు వెలకు లభిస్తాయి.

కన్నులు మిరుమిట్లు గొలిపే ప్రింట్లు, ఎన్‌లార్జిమెంట్లు కావాలంటే, అగ్ఫా ఫొటో సేవలే వాడండి



రు 40.00
(పన్నులు అదనం)

అత్యుత్తమ అగ్ఫా ఫిల్ములు అంతటివద్ద లభిస్తాయి
అగ్ఫా గెవార్ట్ సహకారంతో తయారు చేయువారు:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి., బరోడా



సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి క్రొత్త ఢిల్లీ . కలకత్తా . మద్రాసు



® ఫొటోగ్రాఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు, అగ్ఫా-గెవార్ట్ [illegible]
యొక్క రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

అగ్ఫా క్లిక్—భారతదేశంలో విస్తార ప్రచారంలో కల కెమేరా

CHAG-130-[illegible]

ఒక్కటే-జయమ్మ ఎవరికోసం రైళ్ళు వెతుకుతోంది. ఆ పిచ్చి మనసులోనుంచి ఏమీ బయటకు రాదు. ఆమె ఎవరో ఎక్కడనుంచి వచ్చిందో-ఎందుకు రైళ్ళు వెతుకుతూవుందో బైరాగితోసహా ఈ ఊళ్లో ఎవరికి తెలియదు. కాని, తెలుసు కోవాలి-అపుడే యీ మనసుకు తృప్తి లభించుతుంది.

* * *

గది తలుపులమీద చప్పుడైతే తలుపులు తీశాను. ఎదురుగా బైరాగి నిలబడి వున్నాడు. బయట అంతా చీకటి నల్లగా ముద్దగా అయింది.

బైరాగి ఆదుర్దాగా వున్నాడు. అతని ముఖమంతా చెమటబిందువులు చోటు చేసుకున్నాయి.

"బాబూ జయమ్మ బ్రతికేట్లులేదు. మీరు సాయంచేయాలి."

"ఏమిటి? జయమ్మ కేమయింది?" నేను మరింత కంగారుగా అడిగాను

"ఆఖరి బండి రాగానే వెతుక్కొంటూ ఎక్కింది. కదిలేటప్పుడు దిగిపోయింది. కాలుజారి ప్లాట్‌ఫారమ్‌మీద పడిపోయింది. చాల రక్తం కారిపోయింది బాబూ -ఇంత దయ చూపిన మారాజు లేడు నేను దాన్ని చెట్టుక్రిందకి చేర్చి మీ దగ్గరకు పరుగెత్తుకొచ్చాను"

బైరాగి చాల కంగారుగా వున్నాడు. భయంతో ఒణుకుతున్నాడు. గది తలుపులు వేసి టార్చి తీసుకొని అతని వెనుకే వెళ్ళాను. స్టేషను చేరేసరికి ఐదు నిమిషాలు పట్టింది.

జయమ్మ సిమెంటు అరుగు మీద వెల్లకిలా పడి వుంది టార్చి వేసి చూశాను. ముఖం మీద దుమ్ము కొట్టుకు పోయింది. గాయం నుంచి రక్తం కారుతోంది. నోటిలో నుంచి కూడా రక్తం కారుతోంది. ముక్కు మీద కూడ దెబ్బ బాగానే తగిలింది కాబోలు రక్తం చెమర్చుతోంది.

జయమ్మలో చలనం లేదు.

స్టేషను బయటకు చూశాను. బయట రిక్షా వుంది, అందులో రిక్షావాడు ముడుసుకొని పడుకున్నాడు. వాడిని లేపి నేను బైరాగి రిక్షావాడు కలసి జయమ్మను రిక్షాలో పడుకోబెట్టాము ఆమెను పట్టుకొని బైరాగి కూర్చున్నాడు.

నేను వెనుకే చిడవసాగాను.

హాస్పిటల్ చేరేసరికి మరోపావుగంట పట్టింది. డ్యూటీలో వున్న నర్సు ఎదురుగా వచ్చి రిక్షాలో వున్న పేషెంటును చూసి 'డాక్టరుగారు యింటి దగ్గర వున్నారు' అంది.

'ఇంటికి ఫోన్ చేయి" అన్నాను నేను.

మరో పావుగంటలో డాక్టరు కారు వచ్చి హాస్పిటల్ ముందు ఆగింది. బైరాగి సహాయంతో జయమ్మను లోపలకు తీసుకు వెళ్ళి పడుకోబెట్టాను,

జయమ్మలో చలనం లేదు. రక్తం కారుతూనే వుంది.

డాక్టరు పరీక్షించుతున్నాడు. తెల్లద్దాల కళ్ళలో నుంచి బద్ధకంగా వున్న ఆయన కళ్లు గంభీరంగా మారాయి.

పైన తెల్లటి బల్బు వూపిరి బిగబట్టి చూస్తోంది. ఫాను ఛాల కంగారుగా అదు ర్దాగా వేగంగా తిరుగుతోంది.

"హోప్‌లెస్-అయినా ట్రై చేద్దాము - రక్తం ఎక్కించాలి' డాక్టరు అన్నారు నాకేసి చూస్తూ.

"ఎలాగైనా ఆమెను బ్రతికించండి. ఎంతయినా ఫర్లేదు" అన్నాను నేను.

క్షణాల్లో జయమ్మ రక్తం పరీక్షిం చటం-స్టాండు ఎరేంజి చేయటం జరిగి పోయింది. పైవ బాటిల్‌లో నుంచి ఎర్రటి నెత్తురు చుక్కలు ఒక్కొక్కటే పడుతోంది.

నేను బైరాగి ఆదుర్దాగా చూడ సాగాము.

డాక్టరు కుర్చీవేసు కూర్చున్నాడు.

జయిమ్మలో ఏ మార్పూ లేదు బైరాగి కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయి. ఆతను జయమ్మలో ఏవేవో వెతుకుతున్నాడు. చాల సంవత్సరాలనుంచి అల్లుకున్న మనసు కన్నీళ్ళను వలికించుతోంది.

నేను బయటకు వచ్చాను. సిగరెట్ వెలిగించాను. లోపలనుంచి ఫాన్ మోత తప్ప మరేమీ వినబడటం లేదు. బయట కూడ గంభీరంగానే వుంది. నల్లటి అకాశం మీద చుక్కలు జిరుగుతో అతి కించి వున్నాయి.

వాటివంకే చూస్తూ కూర్చున్నాను.

మరో పది నిమిషాల తర్వాత లోపల నుంచి కెవ్వున కేక వినిపించింది. ఆ కేక బైరాగిది.

కంగారుగా లోపలకు వెళ్ళాను.

బైరాగి జయమ్మ మీద పడి పిచ్చిగా ఏడుస్తున్నాడు,

నర్సు స్టాండు తోసుకుంటూ వెళ్ళి పోయింది.

డాక్టర్ నన్ను చూసి "ఐ యామ్ సారీ, బ్రతికించలేకపోయాను" అన్నాడు. కాని నేను వినే పరిస్థితిలో లేను. బైరా గిని చూడసాగాను. జయమ్మ చచ్చిపోతే బైరాగి ఏందుకు ఏడుస్తాడు? నాకు అర్థం కావటం లేదు. నెమ్మదిగా బైరాగి భుజం మీద చేయి వేసి తట్టాను.

బైరాగి నా వైపు తిరిగి "అంతా అయిపోయింది బాబుగారూ జయమ్మ యిక లేదు" అని ఏడ్వసాగాడు.

బైరాగి కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు. తెరలు తెరలుగా వచ్చే దుఃఖాన్ని తుండుతో ఆపుతున్నాడు. కళ్ళ నీళ్ళు పొంగుతూ చెంపల మీదుగా కారుతున్నాయి. పాతిక సంవత్సరాలు ప్రపంచం అంతా పిచ్చిది అని తరిమి కొట్టినదాన్ని ఒడిలో పెట్టు కొని పోషించిన అనుభూతి బైరాగిని విహ్వలుడ్ని చేస్తోంది. కావచ్చు. ఈ మనిషి చిన్న గుండెలో ఎన్నో అగా ధాలు, సుడిగుండాలు వున్నాయి.

నిండా ముసుగు కప్పి వున్న జయ

మ్మను చూస్తే నాకూ దుఃఖం ఆగటం లేదు.

మనిషికి చివరి బాట-యిన్ని సంవత్సరాలు పెరిగిన ఎన్నో అసూయలకు, ద్వేషాలకు, మమతలకు, కలలకు, కన్నీళ్ళకు నిలయమైన శరీరం పూర్తిగా కలిపి వేసే చోటు—

పుల్లలు వరసగా పేర్చబడ్డాయి. వంకరగా ఎండిపోయినవి కొన్ని తడివి కొన్ని ఒకదాని మీద ఒకటి పేర్చబడ్డాయి. పైన జయమ్మను పడుకోబెట్టారు. పైన యింకా కొన్ని సన్నని పుల్లలు పేర్చారు. వాటి మీద కిరోసిన్ పోశారు.

అగ్గిపెట్టె పట్టుకున్న బైరాగి చేయి ఒణుకుతోంది. అతని ఎర్రబడిన కళ్ళల్లో తీరని ఆవేదన కనబడుతోంది. "బాబూ నా వల్లకాదు. నేను చేయలేను" అంటూ చతికిల పడ్డాడు బైరాగి.

"తప్పదు బైరాగీ! నువ్వే చేయాలి. బాధ కూడ అనవసరం. మనమంతా ఎప్పుడో ఒకసారి చచ్చిపోవలసిన వాళ్ళమే."

చాల చాల చెప్పిన తర్వాత ఒణుకుతున్న చేతులతో అగ్గిపుల్ల వెలిగించాడు.

మరుక్షణంలో మంటలు లేచాయి. ఎర్రటి మంటలు చివర పొగ కొసల నాలుకలతో పైకి పాకుతున్నాయి. వాటి మధ్య జయమ్మ శరీరం కనబడటం

లేదు.

నేను కొంచం దూరంగా చెట్టు క్రింద కూర్చున్నాను. నా వెనుకే బైరాగి వచ్చి కూర్చున్నాడు.

మనిషి చివరిసారి పంచ భూతాల్లో కలిసిపోతున్న దృశ్యాన్ని మరో మనిషి ఆవేదనతో చూస్తున్నాడు. నేను కుతూహలంతో చూస్తున్నాను.

శ్మశానంలో అక్కడక్కడ సగం కాలిన పుల్లలున్నాయి. పగిలిన కుండలు, పాత గుడ్డల పీలికలతో, బొగ్గుల ముక్కలతో శ్మశానం తనని అలంకరించుకొంది. ప్రక్కనే వున్న చేరువలోకి ఎర్రటి మంటలు నీడలు తిరిగి చూస్తున్నాయి.

నాలో ఏవో మసక నీడల మరకలు పడుతున్నాయి. బైరాగి ముఖంలోకి చూస్తూ అడిగాను "బైరాగీ! జయమ్మ చచ్చిపోతే నువ్వు ఎందుకు ఏడుస్తావు?"

బైరాగి అన్నాడు "పాతికేళ్ళు దానికి నా చేత్తో కూడు పెట్టాను. ఆ పిచ్చిది పోయేసరికి నాకు ప్రాణమే పోయినట్టుంది బాబూ!"

"కాదు నువ్వు ఏదో దాస్తున్నావు!"

బైరాగి కళ్ళల్లోంచి నీళ్ళు టప టప రాలిపడ్డాయి. వాటిని ఎడమ చేత్తో తుడుచుకొని "ఏమీ దాయటం లేదు బాబూ!" అన్నాడు. కాని నాకు బైరాగిలో ఏదో మరుగుతూ వుందని గమనించాను. అది తెలుసుకోనిదే నాకు తృప్తి లేదు. బైరాగిని చాల విధాలుగా అడిగాను. చివరికి బైరాగి మండుతున్న మంటల్లోకి చూస్తూ చెప్పాడు.

"నాకు జయమ్మ చిన్నప్పటినుంచి తెలుసు బాబయ్యా. జయమ్మ పల్లెలో హుషారయిన పిల్ల, యింకా సెప్పాలంటే మొగమాటం లేని పిల్ల. పల్లె అంతా తిరుగుతూ అందరికీ అంతో యింతో సాయం చేస్తూ అందరికీ తలలో నాలుకలా వుండేది. జయమ్మ అంటే అందరికీ యిష్టమే. అందరికంటే బాగా యిష్టపడింది యాదగిరి. ఆడు జయమ్మంటే పడి చచ్చేవాడు. అది కనపడకపోతే ఆడు గిల గిల కొట్టుకొనేవాడు. అది ఎక్కడికి పోతే ఈడు అక్కడికే తయారు. అది ఏ పనిలోకి పోతే ఈడూ ఆ పనిలోకే పోయేవాడు. చెట్టులని పుట్టలని రోజూ దాన్ని తిప్పేవాడు నవ్వించేవాడు, కవ్వించేవాడు. ఏడ్పించేవాడు. ఎత్తుకు తిరిగేవాడు. జయమ్మకు, యాదగిరికి పెళ్ళి చేయాలని పల్లెలో అంతా యిష్టపడుతూ వుండేవారు. వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసేస్తే చిలకా గోరింకల్లాగ వుంటారని, రాముడు సీతలాగ వుంటారని పల్లెలో అనుకొనేవారు. కాని అట్టా జరగలేదు. వాళ్ళిద్దరికి పెళ్ళి చేయటానికి జయమ్మ బాబు యిష్టపడలేదు. ఆడో కటిక దుర్మార్గుడు. జయమ్మకు దూరపు మనువు వుందని సింహాద్రితో కుదిర్చాడు. సింహాద్రి ఒట్టి ఎదవ నాయాల. ఆడు పట్నంలో రిక్షా లాగుతూ వుండేవాడు. ఆడు సంపాదించినదంతా

పొద్దుగూకేలకి తాగుడికి, ముక్కాటికి పెట్టేసేవాడు. సుక్కలాంటి జయమ్మను ఆడికివ్వటం అన్యాయం. కాని జరిగి పోయింది. మనువురోజు వరకు జయమ్మను దాని బాబు గడప దాటనివ్వలేదు. యాదగిరితో మాట్లాడనివ్వలేదు. దాని పెళ్ళి సింహాద్రితో జరిగిపోయింది."

"సింహాద్రికి యాదగిరి సంగతి తెలిసే చేసుకున్నాడా?" అడిగాను నేను

"ముందు తెలియదు బాబయ్యా! తెలిస్తే ఎంత తాగుబోతు అయినా మనసు వుంటుంది గందా! కాని ఆడికి మొదట రాత్రే తెలిసింది"

"మొదటి రేత్తిరి జయమ్మ సింహాద్రి కాళ్ళమీద పడి ఏడిసింది. నన్ను ముట్టుకో వద్దంది. తనూ యాదగిరి ఏనాడో మన సుతో మనువాడుకున్నారని, మనసు శరీరం ఆడి కొక్కడికే అని చెప్పింది ఆ మాటలకి సింహాద్రి ఎంతో కరిగి పోయాడు. అన్నాయంగా ముసలి ముండా కొడుకు మాటలు విని జయమ్మను గొంతు కోశానే అని బాధ పడ్డాడు ముసిలాడ్ని చితక తన్ని జయమ్మను యాదగిరికి మారు మనువు చేత్తానని వప్పించాడు. కాని యాదగిరి దొరకలేదు, ఆడు రెండు రోజులకు ముందే పల్లె విడిచి దేశం మీదకు పారిపోయాడు అప్పటి నుంచి అంచే పాతికేళ్ళ నుంచి జయమ్మకు పిచ్చెక్కి ఈ స్టేషనులోనే కాపరం పెట్టింది ఎప్పుడో ఒకసారి యాదగిరి రైల్లో దీనికోసం వస్తాడని ఎదురు చూసేది బాబయ్యా. దాని కోరిక తీర కుండానే పోయింది"

బైరాగి కళ్ళు తుడుచుకున్నాడు.

మంటలు యింకా మండుతూనే వున్నాయి. నాటి వంక బైరాగి జాలిగా చూడసాగాడు.

"అయితే సింహాద్రి ఏమయ్యాడు?" చటుక్కున అడిగాను.

నా ప్రశ్నకు ఉలిక్కిపడ్డాడు బైరాగి. విశాలంగా పరుచుకున్న ఆకాశం వంక చూస్తూ "నేనే సింహాద్రిని బాబూ!" అన్నాడు



ఒరే! ఒరే! తిట్టుకవీ!
ఇదిగో! ఈ పొట్టి కవి
నిన్నిక పాతాళానికి
తిన్నగ తొక్కేయగల
త్రి విక్రముడే, తెలుసుకో!
తెలివిగా మసలుకో!
ఒరే! ఒరే! ఛీ! ఛీ!
నీకు లేదు హ్రీ! హ్రీ!
ముప్పై ఏళ్ళకు ముందర
చొప్ప కవిత రాశావని
మురిసి పోదు వెందుకురా!
మిడిసి పడుదు వెందుకురా!

ఇమిటేషణ దిగంబర కవీ!
ఈ మధ్యే షష్టి పూర్తి జరుపుకుంటివి!
కుష్టు బుద్ధి ఇకనైనా మాననంటివి
నీ అసలు బిరుదు మహామారి కవి!
త్రేతాగ్నులు. పంచాగ్నులు ఉన్నప్పుడు
హంతభుక్కులు లేవంటే యెవడూ ఒప్పడు



శబ్దమంజరి నేర్చుకో
శబ్ద రత్నాకరం చూసుకో
తెలుగే సరీగా రాని నీకు
దేవ భాష యెందుకురా!

రెండు ఒంగళాలతో
ఇద్దరు పెండ్లాలతో,
సామ్యవాది వెట్లారా!
చచ్చు కూత లెందుకురా!
విషం తలదాకా యెక్కిన
ముసలి కవీ! నీ బతుకు
చిల్లిపడిన బొక్కెన

# ఉత్తుంగ శరధి తరంగాలు

దాశరధి

యెంతో సైన్యం వున్నా
యెంతో బలగం వున్నా
నైజామే నన్నేమీ
చేయలేక పోయాడు
నైజాం తొత్తువు నీవు
నన్నేం చేస్తావురా!
ఒక్క తన్ను తన్నానా
కుక్క చావు చస్తావు!

అలనాడు పి. నా. రె. ని
"అక్క డియర్" అని నీ వన్నమాట
అతడుగాని నేనుగాని
అప్పుడే మరిచామనుకుని
పప్పులో కాలేశావ్‌రా
చెప్పుదెబ్బ తిన్నావ్‌రా!

ఆరో రుద్రుని గూర్చి
అవాకులు చవాకులు కూయకు,
అతని కాలి ధూళి తాకు
అర్హత నీకేదిరా!
నీ మహా ప్రస్థానం
నీ పాలిటి మహా శ్మశానం
బూతులు తర్జుమా చేసే
మురికి కపీ! నోర్ముయ్‌రా!
"సినిమా ఎంగిలి మెతుకులు"

తిని బతికే నీవు నేడు
సినిమావాళ్ళను తిట్టి
ఘనుడవు కాలేవురా !

చైనా అంటే భయపడి
సాగిలపడు చవటవురా !
స్వదేశాన్ని ద్వేషించే
పాపాత్ముడ వీవేరా !

'అగ్నిధార' సమవాదపు
సిగ్నల్‌గా తెలుసుకో !
'రుద్రవీణ' విప్లవ కవి
ముద్రగా గ్రహించుకో !
'పునర్నవం'లోని క్రాంతి
పునశ్చరణ చేసుకో !
'కవితా పుష్పకం'లోని
నవతను జీర్ణించుకో !

ప్రజా మహోద్యమాలతో
భుజం కలిపి ముందుకురికి,
సామ్యవాద సమరంలో
సాహస చర్యలు జరిపి
ప్రజా శత్రువుల గుండెలు
ప్రయ్యలుగా వించిన
దాశరథిని ఎదిరించే
దమ్ములు నీకేవిరా ?
త్యాగశక్తి తెలియనట్టి
దద్దమ్మవు నీవురా !
మళ్ళి మవ్ పిచ్చాస్పత్రికి
వెళ్లే రోజొస్తున్నది

నెత్తిమీద కత్తిగాట్లు
నిమ్మరసం మర్దనాలు!

నువ్వు సామ్య వాది వంటే
నవ్వి పోతుంది లోకం
అడుగడుగునా అవకాశవాదివి
అణువణువునా అరాచకవాదివి
బాధ్యతా రహిత మిథ్యా జీవివి
మార్జాలంలా కళ్లు మూసుకు పాపాలు తాగే
బూర్జువా వర్గపు బూజు ప్రతినిధివి
నీ బతుకొక మురికి గొంది
నీ బుద్ధే ఊర పంది
ఒకటికి పది వడ్డిస్తా!
తోలు ఒలిచి యెండేస్తా!
ఖబర్దార్! బడా చోర్!
చచ్చు కవీ! పుచ్చు కవీ!
పిచ్చ కవీ! రొచ్చు కవీ!

[విఫల విప్లవ మహామారి కవికి·

ఒరే మొద్దు సుబ్బాయ్! కొంగ జపం చేస్తూ అంగనలమీద చెయ్యేసే దొంగ స్వాముల తోలు వలిచినట్లు, పలాయన వాదంతో, చవకబారు చమత్కార వాదంతో, సంచలన వాదంతో, అవకాశ వాదంతో ధన స్వామ్యాన్ని బతికించ జూచే నీలాంటి దొంగ సామ్యవాదుల చమడాలెక్కదీసే రోజులు దెగ్గరపడుతున్నాయి. సామ్యవాదం కోసం సమరం జరిపి ప్రాణాలు బలిపెట్టే మహా శక్తులు నీలాటి ఈజీచైర్ సామ్యవాదుల బండారం బట్టబయలు చేస్తాయి. నినాదాల నీడలో నిజం దాచ జూచే నీవంటి నీచుల్ని ఉప్పు పాతర వేస్తార్రా! కాచుకో! వస్తున్నది ప్రళయ ఝుంఝ! ధన స్వామ్యం కొమ్ముకాచే నిన్ను ఊద్చేస్తుందిరా!]

# పానగల్ పార్కులో

—యామిజాల పద్మనాభస్వామి

నేను వెళ్ళేసరికి గోవిందరావు తప్ప మిగతా ముగ్గురూ వచ్చారు 'ఇవాళ గోవిందం కొంచెం ఆలస్యంగా వస్తా నన్నాడు. రండి బాబూ!' అన్నారు శర్మ గారు నన్ను చూసి. నమస్కరించి కూర్చు న్నాను. అంతలో ఆపసోపాలు పడుతూ పైమీది కండువా జారిపోతూంటే ఒక చేతితో సర్దుకుంటూ వచ్చాడు గోవింద రావు. సరాసరి నా పక్కకు వచ్చి కూర్చుని నా వీపుమీద చిన్న చరుపు చరిచాడు. శర్మగారు చిరునవ్వు నవ్వి 'ఏం గోవిందం! బాబు నీకన్న ముందు వచ్చినందుకు బహు మతా వీపుమీద చరుస్తున్నావు?' అన్నాడు 'శర్మా! అది బహుమతీ కాదు. పారితోష కం, అయినా స్వామిజీ నా ఆరవ ప్రాణం' అని 'ఏదీ ఆ సిగరెట్టు పెట్టె, యిలా రానీ!' అని చెయ్యి చాచాడు.

'నీ ముష్టి ముక్కలు కానూ! జేబులో సిగరెట్టు పెట్టె అదుగో కనిపిస్తూనే వుంది, శర్మగారిని అడుగుతూన్నావు. ఈ పాడు గుణం ఎప్పుడు పోతుంది నీకు?' అన్నాడు ప్రకాశరావు.

'ఒరే ప్రకాశం, 'ఆపదర్థం ధనం రక్షేత్' అన్నారు పెద్దలు. సమయానికి రమ్మంటే ఎక్కడ వస్తుంది! రేపు సాయంకాలంవరకూ మా ఆవిడ-తప్పు! తప్పు—గృహలక్ష్మి. ధర్మపత్ని, యజ మానురాలు సిగరెట్లకు డబ్బులు యివ్వనని నా జందెం సాక్షిగా చెప్పేసింది. ఇప్పుడే కొన్న కొత్త పెట్టె యిది. ఇంకా ప్రారం భోత్సవం చెయ్యలేదు. రాత్రి భోజనా నంతరం ..ఇక ముష్టి అంటావా? లక్ష్మీ దేవమ్మగారికి ప్రాణేశ్వరుడనిపించుకున్న ఆ మహావిష్ణువంతవాడు బలిచక్రవర్తి దగ్గర చెయ్యి చాచేడు. ఇక నువ్వూ నేనూ 'శాకామవా లవణామవా' ఉప్పా? పత్తిరా?-మూడో పాయింటు, ఈ గుణం ఎప్పుడు పోతుందన్నావు. పుర్రెను పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదన్నారు పెద్దలు. తెలుగు చదివి ఏడిస్తేనా యిలాటి ఆణి ముత్యాలవంటి సామెతలు తెలియడానికి.

అరవవాళ్ళతో పుట్టి పెరిగి మహా విద్వాంసుడని జేగంట వాయించిన అప్పయ్య దీక్షితులుగారు ఏమన్నారు? అని రొకాయించి అడిగాడు గోవిందరావు.

'ఏమన్నారు?' అన్నాడు లక్ష్మణశాస్త్రి.

'ఔను నువ్వు సంస్కృతం ఏడిస్తేగా నీకు ఆయన ఏమన్నాడో రావడానికి?' అన్నాడు గోవిందరావు.

'ఏమన్నాడు బాబూ!' అని నవ్వుగా

అన్నాడు నన్ను చూపి శర్మగారు.

'ఆంధ్రత్వం ఆంధ్రభాషా చ
నాల్పస్య తపసః ఫలమ్'.

ఆంధ్రుడై పుట్టటం, ఆంధ్రం మాతృ భాష అవడం అలాటి యీలాటి తపస్సు చేస్తే కాదు ఎంతో గొప్ప తపస్సు చేస్తేనే ఆ అదృష్టం పట్టుతుంది' అని అన్నాను నేను.

'చూశావా' ప్రకాశం। మా స్వామిజీ జ్ఞాపకశక్తి' అన్నాడు గోవిందరావు సిగ రెట్టు పొగ మీదికి వదిలి.

'ఏం లాభం! మనమూ, మన మాతృ భాషా ఎంత కీర్తి సంపాదించితే ఏమి లాభం, కాలం, కర్మం అలా కాలిపో యాయి. తెలుగు ధారాళంగా మాటడడం రాకుండా అయిపోతున్నారు మన బాబులు చాలామంది' అని కాస్త నిస్పృహగానే అన్నారు శర్మగారు.

'ఎక్కడ వుందంటావు ఈ దోషం?' గోవిందరావు ప్రశ్న,

'తల్లితండ్రులలో వుంది. మాటలు వచ్చిన యీడునుంచీ వాళ్ళకి యింగ్లిషు భాషలో పరిచయం చేస్తూ అయిదేళ్ళు రాకుండానే కాన్వెంటుకి పంపిస్తూ విద్య నేర్పిస్తున్నారు. అక్కడ నానాగోత్రాలవారి పిల్లలతో సావాసం. ప్రధానంగా నేర్చు కొనేది ఇంగ్లీషు. ఇక తెలుగు ఎలా వస్తుంది?' అన్నారు శర్మగారు.

'తల్లిదండ్రులు యింట్లో చెప్తూ వుంచే ఎందుకు రాదూ?' అన్నాడు లక్ష్మణశాస్త్రి.

'నీకు తెలియదు లక్ష్మణా। ఇంట్లో తల్లిదండ్రులు యింగ్లీషులోనే మాటాడు తారు. తమ పిల్లలు లండన్నుంచి వచ్చిన దొరబాబయ్యలయిపోవాలనే మహదాశయ ముతో....మరి ఆ పిల్లలు స్కూళ్ళలో తెలుగు చదువుతున్నారే' అన్నాడు ప్రకా శం,

'చదువుతున్నారు. నాకెంత తెలుగు వచ్చునో వాళ్ళకీ అంతే వచ్చు—అన్నారు శర్మగారు. నేనీ మధ్య ఒక పిల్లవాణ్ణి హైస్కూల్లో పదకొండవ తరగతి చదువు తూన్న విద్యార్థిని 'గజగమనం' అంటే ఏమిటి అర్థం అని అడిగాను. వాడు 'గజం దూరం వెళ్ళడం' అన్నాడు. నవ్వు ఆపుకో చింతకాయ పులుసుకి ఇంగ్లీషులో ఏమ నాలి అన్నాను. తెల్లమొగం వేశాడు. ఇలా వున్నాయి చదువులు వాళ్ళే వెంటనే చెడ్డ లేవడలంటే అన్నారు శర్మగారు.

ఇంతకీ నువ్వే మంటావు? నీ ధోరణి మాకు అర్థం కాలేదన్నాడు గోవింద రావు.

''అర్థం కావనడానికేముంది వడ్ల గింజలో బియ్యపుగింజ. ఏదేదో డిగ్రీలు సంపాదిస్తూ వేషాలు వేస్తూతి రిగే పద్ధతిలో వుందిగానీ చదివిన చదువులో సత్తా కని పించకుండా పోతోంది దేశం - అని నా ఆరాటం.అన్నారు శర్మగారు

'అందుకే మన మంత్రులు మాతృ భాషలోనే వ్యవహారం అంతా జరగాలి యిటుపై అని శాసనాలు చేస్తున్నారు.

హుంకుం జారీచేస్తున్నారు కింది ఉద్యోగులకు అన్నాడు గోవిందరావు.

"నిజమే బాగానే వుంది, అని చిరునవ్వు నవ్వారు శర్మగారు."

"ఎందుకు నవ్వుతున్నావు అన్నాడు గోవిందరావు.

'బాబుని అడుగూ-అని మళ్ళీ నవ్వారు.

'ఏమిటయ్యా కధ? అన్నాడు గోవిందరావు నన్ను చూసి.

'ఏమీలేదు. ఇంగ్లీషులో వున్న ఒక పేరుకి తెలుగులో వున్న అనువాదం చదివి ఒక పెద్దమనిషి చెప్పినమాట విని బాబు నాకు చెప్పారు మొన్న అన్నాడు.

'ఏమిటది జెప్పనయ్యా! ఏడిపించుతినక-అన్నాడు గోవిందరావు

'ఏమీ లేదు 'వైర్‌లెస్ హౌస్' అని వుందట ఇంగ్లీషులో ఒక బోర్డు మీద దానికి క్రింద 'వితంతు గృహము' అని తెలుగు అనువాదం వుందట. అని నేను అనగానే అందరూ పకపక నవ్వారు గోవిందరావు విరగబడి నవ్వి 'బలే అనువాదం శర్మా! ...అన్నాడు.

'ఇలా వుంటాయి మాతృభాషలోనే జరగాలంటే. దేనికి యివ్వవలసే ప్రాముఖ్యం దానికి యివ్వాలి. అన్నారు శర్మగారు

"ఈ అనువాదం ఉద్యోగానికి నిన్ను వేస్తే ఏమి చేస్తావు అన్నాడు గోవిందరావు.

'ససేమిరా వద్దు. రానంటాను. ఈలాటి అనువాదాలూ చెయ్యవద్దంటాను."

"గొప్ప అనువాదమే." అన్నాడు ప్రకాశరావు. తలుచుకుని తలుచుకుని పొలమారేంత వరకూ నవ్వాడు లక్ష్మణశాస్త్రి.

అంతలో రివాజు ప్రకారం పార్కులో లైట్లు ఆరిపోయాయి. 'పార్‌రాజా! అనే పాట సగంలోనే ఆగిపోయింది. మా కూటం లేచి బయటికి వచ్చేశాము.

# మీరు సంపాదించదలచుకున్నారా !




## మీ ఫిక్సెడ్ డిపాజిట్లు మీద

## వడ్డీ ఉంది కాని ఆదాయపన్ను లేదు.

6 సం॥ ఇంకా పైన నిలవచేసే ఫిక్సెడ్ డిపాజిట్లుపై 7% వరకు వడ్డీ పెంచబడింది.

బ్యాంకులో నిలవచేసిన ఫిక్సెడ్ డిపాజిట్ పై సాలుసరి వడ్డీ రూ 3000 వరకు వచ్చేట్లయితే దానిపై ఆదాయపుపన్ను ఉండదు.

రూ. 1 50,000/- వరకూ వున్న బేంక్ డిపాజిట్లకు వెల్త్ టేక్సు లేదు

రెండు సంవత్సరాలు ఆ పైన దాచే ఫిక్సెడ్ డిపాజిట్లుపై వడ్డీ ఈ క్రింది విధంగా పెంచబడినాయి.

| | |
|---|---|
| 2 సంవత్సరాలు 3 సంవత్సరాలు వరకూ (కూడా కలిపి) | 6% |
| 3 సం॥ మించి 6 సం॥ వరకు (కూడా కలిసి) | $6\frac{1}{2}$% |
| 5 సం॥ మించి 6 సం॥ వరకు (కూడా కలిసి) | $6\frac{3}{4}$% |
| 6 సం॥ ఆ పైన | 7% |

**వివరాలకు మా 450 బ్రాంచీలలో దేనినైనా సంప్రదించండి**




# సిండికేట్ బ్యాంకు

(భారత ప్రభుత్వ ఆధీనంలో వున్నది)

హెడ్ ఆఫీసు
మనిపాల్

కె. కె. పాయ్.
కస్టోడియన్

# ప్రాసక్రీడలు

వాదానికి వాదముంది
బాణానికి బాణం
స్నేహానికి ప్రాణముంది
గానానికి గానం

వాదాన్నెదిరించలేని
వాడే తిడతాడు
వాదబలం మూలధనం
అదేవాడి కురితాడు

పొట్టికవికి ఆవేశం
వెనకనించి పంపు
శరీరమే రొచ్చుగుంట
శారీరం కంపు

దేశభక్తి పీడికి ము
త్తాతగాడి సొత్తు
నిజమాడే వాడేమో
పరదేశపు తొత్తు

శ్రీశ్రీ

బూతులోంచి పుట్టాడు
బూతు పనికి సిద్ధం
అయినా అటువంటి మాట
లనరాదు నిషిద్ధం

పడక కింద సెక్సు బుక్కు
గది గోడలు గలీజు
నడి తరగతి నాగరికత
స్వవంచనల రివాజు

పియ్యేపీలో నా ఒక
సగం పాట కతికేవు
ఇంకెందుకు నీతులు నా
ఎంగిలి తిని బతికేవు

ఇరువురాంధ్రు రెండిళ్ళని
ఎందుకు కడుపుబ్బరం
యెనక దన్ను బిగిసిందని
ఎంత గుండె నిబ్బరం

తననాలకి రాయలేవు
మాటలకే కరువు
సినిమా చాన్సులు దొరక్క
మనసు కెంత బరువు

ప్రొడ్యూసరు కాలిబూటు
షడ్రస మిష్టాన్నం
తారారాధన మొకచే
తప్పని సరి భ్రష్టాధ్వం

నారాయణరెడ్డి లాగ
రాయాలని దురద
కలం నించి కారేదే
చవక సెక్సు బురద

ఐడియాల దారిద్ర్యం
అయ్యయ్యో అనర్థం
అమ్మిందే నాల్గు చోట్ల
అమ్మాలని ప్రయత్నం

చాటు మాటు వ్యభిచారం
సాగుతున్నాడు
సర్కారుద్యోగానికి
సలాం కొట్టబోడు

(ఇక మీద పేడి మీద కవిత్వం ఖర్చు పెట్టడం దండుగ. నన్నుతిస్తే సాదే తీన్ కోన్‌కిస్కాల్లో పేడో స్తనంధయుడు. ఆఖరి సారిగా మాత్రం ఓ చిన్న వార్నింగ్.)

ఒద్దు సుమా చెడిపోతావ్
ఒద్దికగా నడచుకో
ఓనమాలు రానివాడ
ఒళ్లు తెలిసి మసలుకో

(ఓ చిన్న వివరణ: హూక భుక్కకి బహువచనం లేదనడం వ్యాకరణ రీత్యా కాదు, గరుత్మంతుడు అనే మాటకి బహువచనం సాధ్యమే, కానీ, గ్రద్దలెన్ని ఉన్నా గరుత్మంతు డొక్కడే.)

# జోయ్ మోర్స్ గరల్

ఎ ఎస్ ఆర్ చంద్రప్రసాద్

"ప్చ్ చిదానంద వరస నాకేం నచ్చ లేదు" అన్నాడు సుబ్బారావు పెదవి విరిచి,

అందరూ వాడికేసి ఆత్రుతగా చూశారు.

"ఏం నేను అప్పారావుకంటె తీసిపో లేదే" అన్నాడు అప్పారావుకేసి తిరిగి చిరునవ్వు నవ్వుతూ. అప్పారావు నేల చూపులు చూశాడు.

సుబ్బారావు తెల్ల మొఖం వేశాడు, "ఏమిటి నువ్వనేది?"

"వాణ్ణే వాడుగు వాడే చెపుతాడు వాడు అందమైన వాళ్ళ మామయ్య కూతుర్ని పెళ్ళి చేసుకోబోతున్నాడు."

అంతా ఎవరి ముక్కులమీద వాళ్ళ వేళ్ళు వేసుకున్నారు

అప్పారావు ప్రదర్శించిన ఇన్‌డిసిప్లిన్ నిరసించారు.

"అందంగా వున్నది వాళ్ళ మావయ్యా? వాళ్ళ మావయ్య కూతురా?" మెడ రిక్కించి క్యూరియస్‌గా అడిగాడు శర్మ.

"ఏరా నిజమేనా ?" అప్పారావుని నిలదీసి అడిగాడు సుబ్బారావు ప్రెసిడెంట్ హోదాలో.

"ఔనట్రా! నాకూ తెలియదు యివాళే మా నాన్న ఉత్తరం రాశాడు" అత్తగారి ముందు అల్లుడిలా తలొంచుకొని సిగ్గు పడుతూ అన్నాడు అప్పారావు.

"హారి ఛడవా! ఎంత దుర్మార్గం! హెంత దుర్మార్గం! శర్మ సహించరాని నేరం, వార్నింగ్‌కి కూడా అవకాశం లేని అపరాధ వీణ్ణి తక్షణం బర్తరఫ్ చెయ్యాలి" అరిచాడు శాస్త్రి

"స్స...అబ్బాయిలూ మీరాగండి. హేట్ ది లేడీ అసోసియేషన్ ప్రెసిడెంట్ హోదాలో మిగిలిన మెంబర్లయిన మీ ముందు వాణి శిక్షిస్తున్నాను. మొత్తం రెండు శిక్షలు. ఒకటి - వాడి ఖర్చులో మనం డిన్నరు తింటం, రెండు - వాణ్ణి హేట్ ది లేడీ అసోసియేషన్‌నించి ఒక వారం రోజులు అనగా మళ్ళీ ఆదివారం వరకు సస్పెండ్ చేస్తున్నాను" అన్నాడు సుబ్బారావు గంభీరంగా.

మెంబర్లంతా చప్పట్లు కొడుతూ హాహా కారాలు చేశారు. అప్పారావు రుమాలు తీసి. ముక్కు చివర అంటుకున్న సిగ్గు, ఆనందం తుడుచుకున్నాడు.

"ఇంతకీ చిదానంద్ ఏం చేశాడో తేలాలి" అన్నాడు ఏక్టివ్ మెంబర్ శాస్త్రి.

"అవును. తేలాలి. వీడు ఆడవాళ్ళు ముట్టుకున్న పుస్తకాల్ని తాకి అపవిత్రుడై పోయాడు. నిన్న నేను కాలేజీ దగ్గర తోటలోకి వెళ్తూ చూశాను. అప్పుడు వీడు లేడీస్ వెయిటింగ్ రూమ్ ముందునుంచి వెడుతున్నాడు. వీణ్ణి పిలిచి వెయిటింగ్ రూము గుమ్మంలో నుంచున్న శారద వీడి నోట్సు పుస్తకం అడిగి తీసుకుంది" అన్నాడు ఆచారి పాతకాలపు పంచాయితీ మెంబర్లాగా.

"ఏరా! నిజమేనా?" అన్నాయి ఒకేసారి బోల్డన్ని గొంతులు.

"ఔను! నిజమే! నేను ఆమెను ప్రేమించటం లేదుగా."

"ఏమో? ఎవడు చూడొచ్చాడు?" శాస్త్రి.

"లేకపోతే నోట్సెందుకిచ్చావు?" శర్మ.

"యిప్పుడు కాకపోతే తర్వాతైనా ప్రేమిస్తావు!" ఆచార్య.

"ఔను నిజమే. యిప్పుడు ప్రేమించక పోయినా తర్వాతైనా తప్పకుండా ప్రేమిస్తాడు. ఫెమిలి యారిటీ బ్రీడ్స్ లే బిట్వీన్ ఎ బోయ్ అండ్ గరల్ అన్నాడు ప్రేమ కవి. కాబట్టి వీణ్ణి నమ్మలేం!" అన్నాడు సుబ్బారావు.

"అంతే మరి. యీ వయస్సులో ఒక సెక్సుమీద మరొక సెక్సుకు ఉండే దురలి మానమే ప్రేమ యనంబడు, అన్నాడు చిన్నయ్యాసూరి ప్రేమ వ్యాకరణంలో" అన్నాడు రామకృష్ణ.

నేను కొంచెం చిరాకు నటించి "ఇంతకీ ఏమిటోయ్ మీ గోల" అన్నాను.

"వయస్సులో ఉన్న ఆడదాన్ని ప్రేమించటం గాని, చివరికి ఆ గాలి సోకి అపవిత్రత పొందటంకాని కూడదన్నది మన హేట్ ది లేడీ అసోసియేషన్. ముఖ్య సిద్ధాంతమని ఒప్పుకుంటావా?" అడిగాడు సుబ్బారావు.

"ఒప్పుకుంటాను కాని గాలి సోకటం తప్పనుకోను."

"ఒరేయ్ ప్రసిడెంటూ వీడు రివల్యూషనరీగా తయారైపోయాడు ఆడగాలి సోకింది."

"షూట్ ది ఫెలో."

"ఒరేయ్ మెంబర్లూ యిక్కడ ప్రసిడెంటున్నాడు నేను సెక్రటరీని. మీరందరూ మాట్లాడకండి" అన్నాడు రామకృష్ణ.

"పోవోయ్ బోడి సెక్రటరీ ప్రేమ గురించి నీకేం తెల్సు?" అన్నది ఒక కంఠం.

"ఇంతకీ నువ్వు శారద గాలి తగలకుండా పవిత్రత కాపాడుకుంటావా లేదా?" ప్రశ్నించాడు సుబ్బారావు.

"మనవంతా రూమ్ 307లో కూర్చున్నప్పుడు ఆడగాలి మరి మీ అందరికీ సోకటంలా? ఆ దగ్గిరేగా వైటింగ్



రూముంది!'' అన్నాను.

''హోయ్... హోయ్,,. .హోయ్''
అన్నాయి నాలుగైదు కంఠాలు.

''అది విధికృతం. మనవేం చెయ్యలేం
పైగా అటునుంచి వీచే గాలి వీలైనంత
వరకు పీల్చటం మానేస్తున్నాం'' సుబ్బా
రావు.

నాకో పాత సంగతి గుర్తుకొచ్చి
అన్నాను: 'ఏడిశావ్, ఓసారి గట్టిగా గాలి
పీలిస్తే మల్లెపూల వాసనొస్తోందిరోయ్ అని
నువ్వే అన్నావు.'

''ఆ...దుర్మార్గుడా. అయినా అప్పటికి
మన హేట్ ది లేడీ అసోసియేషన్ మువ్
మెంట్ బయల్దేరి ఉండదు'' అన్నాడు
సుబ్బారావు తప్పించుకోటానికి చూస్తూ.

''అయితే నేను వీలైనంతవరకు ఆ
గాలి నాకు తగలకుండా గాలి వీచే వేపు
నుంచే మాట్లాడతాను.''

''అప్పుడింకా ప్రమాదం. నీ గాలి
ఆమెకు సోకుతుంది. అదది ప్రేమించిం
దంటే నిన్నో పట్టాన ఒదిలిపెట్టదు.
పూర్వం....అయినా ఎందుకులే'' అన్నాడు

ఆచారి!

"పూర్వ గాథ వివరించునది ఆచారీ" అన్నాడు శాస్త్రీ.

"పఠికుల కోరిక" అన్నాడు అప్పారావు.

"పూర్వం విశ్వామిత్రుడను బోడ్డు జడలున్న మగాడు ఒక్క జడ గల 'మేనక' యను కాశ్మీర యువతిని... కాదు.. యువతిచే ప్రేమించబడి,. భరతుడను మునిని బడసిన శకుంతల యను అందమైన పుత్రికని కనుటచే మనము భారతీయులమైతిమి."

"హారి దౌర్భాగ్యుడా! అదా కంక్లూజెన్, నీకు తెలుగు కూడా రాదురా!" శాస్త్రీ.

"ఆర్డర్! ఆర్డర్! వాడికి తెలుగు రాక పోవటం కాదు. మనకు కావలసిన కంక్లూజన్" సుబ్బారావు అందుకున్నాడు.

"అవన్నీ పాత కథలు. అందాకా ఎందుకు. 'పెండ్లి పిలుపు' సినిమాలో చూడండి, ఓ అమ్మాయి, అబ్బాయి, పడి పోయిన పుస్తకం గురించి కాపేపట్లోనే ప్రేమించేసుకుంటారు."

"నువ్వు తగ్గరా! చివరికి పీడ్డి కండెమ్డ్ మెంబర్‌గా రివర్ట్ చేశాం ఎవరికన్నా ఆక్షేపణ ఉందా?" సుబ్బారావు అడిగాడు.

"లేదు ప్రభూ" అన్నాడు అప్పారావు.

యింక మాట్నీకి టైమౌతోంది కాబట్టి అందరు లేవాం!

• • •

ఒకానొక సాయంత్రం అందరం కలిసి కుళాయిల చెరువు గట్టుకి షైరు వెళ్ళాం. ఒక్క సుబ్బారావు మాత్రం ఏదో పని మీద టౌన్‌లోకి వెళ్ళాడు. కొంతసేపు పిచ్చాపాటీ కబుర్లయాక అందరం వరసగా గట్టు పంచన పడుకున్నాం. ఆచారి భావ గీతాలు పాడుకుంటున్నాడు.

"ఎవరో నా హృదయ నాళమును తునియలుగా...ననాననా..." అంటూ.

మిగిలినవాళ్ళం సిగరెట్లు కాల్చుకుంటూ ఆలోచనల్లో పడ్డాం.

యింతలో రెండు ఎర్రటి స్లిప్పర్లు, రెండు లేత పాదాల్ని కావలితెచుకుని, మా తలలపై నుంచి వెళ్ళిపోతూ 'టిక్కు టిక్కు' మని రీవిగా అన్నాయి

'టిక్కు టిక్కు' అంటే వాటి భాషలో "యిటు చూడండోయ్ కుర్రాళ్ళూ" అనిట అర్థం.

ఎల్లాగో ఆ స్లిప్పర్ల భాష మా కర్థమై తలెత్తి చూసేటప్పటికి స్లిప్పర్లు ముందు కెళ్ళిపోయాయి.

అది హంస గమనంలో కదిలిపోతున్న ఒక సుందరమైన యవ్వనవతి యొక్క సుందరమైన వెనుకభాగం. సుందరమైన వెనుకభాగం సుందరమైన యౌవనవతిది అనటం తెలివితక్కువ మాటని శర్మ ఒక జెనరల్ అబ్జర్వేటరీ డిసిషన్ యిచ్చినా, తను కూడా తెలివితక్కువవాడై పోయాడని వాడి మొఖం చెప్పకయే చెప్పతోంది.

"ఎవ్వరా వెనుదిరిగి చూడని... తరుణి?"

"హంసాలస మంద యాన"

"వికచాదుల కోమల నీరజాస్య."

"బాలాలికు లాళి నీల కుటిలాలక."

"లోల విశాల నేత్ర,"

"కుత్కీల తనూజ"

"షటప్ రాంగ్ డిస్క్రిప్షన్"

'నువ్వే షటప్పు నాది బ్యూటిఫుల్ డిస్క్రిప్షన్."

"మరి కుక్కల తనూజ అంటా వేం? ఆ అమ్మాయి అంత సన్నంగా నాజూగ్గా వుంటేను."

"పార్వతీదేవి అంత అందమైనదని డిస్క్రైబ్ చేశాడోయ్ వాడు"

'అయితే అవచ్చుగా ఆ పదం వాడ కూడదురా!"

"ఏవిటోయ్ పెద్ద నువ్వు మాట్లాడ తావు! అ అమ్మాయి మొఖం చూసే అన్నావా? ఇక చామల కోమల నీరజాస్య అని?"

"లోల విశాలనేత్రా? తింత్రిణీనయనా? నువ్వు చూశేడిశావేవిటి? లేకపోతే."

"అంతెందుకురా! మత్కీల తనూజన్నప్పుడే వాడు ఎస్సేలు ఒట్టిపడతాడని తేలిపోయింది."

"మీరు వాడిన సమాసాలు ఒట్టి కావా బాబూ?"

"ఒరేయ్! సమాసాలంటే గుర్తొచ్చింది కొత్తగా పి. యు. సి. లో చేరిన సుబ్బమ్మ....!

"సుబ్బమ్మ, పుల్లమ్మ-మీకెందుకురా. ఆడాళ్ళగురించి? మీరంతా ఎసోసియేషన్ మెంబర్లు కారూ? ఒక ఆడవాన్ని పక్షించ డంలో ఒకళ్ళతో ఒకళ్ళు దెబ్బలాడుకుని. మహాపరాధం చేశారని ప్రెసిడెంటుతో చెప్పి మీకు శిక్షలు వేయిస్తా చూడండి" అన్నాను ఫోజులో

"ఎవరా తరుణి అని మొదలుపెట్టింది నువ్వేనని గుర్తుతెచ్చుకో" దాంతో అందరం సంధిచేసుకున్నాం. యీ కు. చె గ (కుళాయిల చెరువుగట్టు) సంధి ప్రకారం యీ రోజు సంగతులు ప్రెసిడెంటుతో ఎవరూ చెప్పకూడదు.

* * *

ఆచారి "కు కూ ." అంటూ కూనిరాగం తీస్తూ టాయ్‌లెట్ అవుతున్నాడు. అప్పారావు వాళ్ళ మావయ్య కూతుర్ని గురించి కలలు కంటున్నాడు. సిగరెట్ పొగ వదుల్తూ శాస్త్రి మంచంమీద వెల్లకిలా పడుకుని మెడకిందకి వేళ్ళేసి ఆలోచిస్తున్నాడు. రామకృష్ణ ఆచారిపెట్టిని దప్పు వాయిస్తున్నాడు.

ఈ తరుణంలో శర్మ శరవేగంతో 'ఒరేయ్ ప్రెసిడెంటూ ఏక్సిడెంటు!' అంటూ వగరుస్తూ వచ్చి క్షణం చూచి కొయ్యబారిపోయి "ఏరా సుబ్బా రావేదీ" అన్నాడు.

సుబ్బారావు లోపలి గదిలోంచి వస్తూ "ఏమిటి" అన్నాడు.

"అబ్బే మ . మరేం లేదూ....ఉ"... అంటూ సిగ్గుపడ్డాడు శర్మ

"చెప్పేడవ్వోయ్! మనలోమనకి సీక్రెటేమిటి?" అన్నాను నేను. శర్మ అమాయకంగా ముఖంపెట్టి "అదికాదురా యివ్వాళ ముగ్గురాడాళ్ళు నన్ను ఒక్కణ్ణిచేసి ఏడిపించారు" అన్నాడు.

మేమందరం గొల్లుమన్నాం.

"తప్పు నవ్వకండి" ప్రెసిడెంటు సీరియస్‌గా అన్నాడు.

"ఐతే నువ్వేడిచావా?" శర్మని ప్రశ్నించాడు రామకృష్ణ

"అబ్బ నవ్వారుకోరా! సంగతేమిటో చెప్పనీ" సుబ్బారావు.

"ఇవ్వాళ కాలేజీ లేదుకదాని, బొటానికల్ గార్డెన్స్‌లో చదువుకోటాని కెళ్ళాను. కొంచెంసేపు చదివి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో ముగ్గురమ్మాయిలు, ఒక హేమ, యిద్దరు కొత్తమ్మాయిలు కలిపి వచ్చారు బహుశా కొత్తమ్మాయి లిద్దరూ పి యు సి లో చేరుంటారు, ఒకామె "ఏమిస్వామీ! ఈ కాననం మునకేతెంచిరి" అంది యింక మిగిలిన యిద్దరూ వరసగా అందుకున్నారు.

"తమరు జడవారులా?"

"మరి జడలు లేవేం?"

"వరం కావాలా?"

"తపస్సు చేయుచున్నారా?"

"ఎవరి గురించి?"

"ఏ సుందరిని గురించి?"

'అయ్యో! అపచారం, ఆయనకి ఆడవాళ్ళంటే అసహ్యమే!"

"ఆ గాలే పీల్చరా."

"పాపం! వాళ్ళ నాన్నగారే పాలిచ్చి పెంచారనుకుంటా.."

అందరూ గట్టిగా నవ్వారు.

"మరి నువ్వేమన్నావు?" సుబ్బారావు

"ఏమంటాను వయస్సులో వున్న ఒంటరి మొగాడు కనిపిస్తే యీ ఆడాళ్ళకెంత చులకన? ' అన్నాను. పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వారంతా!

"అప్పుడు వాళ్లేమన్నారు?" శాస్త్రి.

"మీలాగే నవ్వి వెళ్ళిపోయారు"

"ఇది పురుష జాతికే అవమానం. ముఖ్యంగా మన హేట్ ది హేపీ అసోసియేషన్‌కి. దీనికి ప్రతీకారం జరిపి తీరాలి" అన్నాడు సెక్రటరీ రామకృష్ణ పిడికిలి బిగించి.

సుబ్బారావూ ఆ ధోరణిలోనేవున్నాడు. "సరే కనుక్కుందాం హేమ యిల్లు తెలుసా ఎవరికన్నా?'

"నాకు తెలుసు' అని కటిక్కుని శాస్త్రి నాలిక్కరుచుకున్నాడు.

"నీకు ఒక ఆడదాని యిల్లెందుకు తెలిసింది" అనే ప్రశ్న అందరి నాలుకల చివరికి వచ్చినా ఎవరూ అడగలేదు.

"సరే వెడదాం" అన్నాడు సుబ్బారావు.

అందరం వాక్‌కి ప్రిపేరయి బయలుదేరాం.

"ఎరేయ్....ఎవరికి తోచింది వాళ్ళది గేయండి గట్టిగా నేను మొదలెడతాను.

శర్మకి క్షమాపణ చెప్పుకుందాం'' అని కాషన్ యిచ్చాడు యింటి ముందుకి రాగానే సుబ్బారావు.

"అరుగో వాళ్ళు ముగ్గురేరా!''అన్నాడు శర్మ కసిగా వరండాలోని ముగ్గురమ్మా యిలూ మా పటాలాన్ని చూసి ఆశ్చర్యంతో నోళ్లు తెరుచుకని నుంచున్నారు. అందులో కొంచెం పొట్టిగా ఉంగరంలో రాయిలా మెరిసిపోతున్న ఒకమ్మాయి. సుబ్బారావు కేసి వింతగా చూసింది. చూసి సినిమాలోలాగ 'బా ...వా....!' అంది టెంపో నిలిపి. "ఓ రా ణీ . !'' అన్నాడు సుబ్బిగాడు అదే టెంపోలో. కానీ ఒకళ్ల కోసం ఒకళ్లు చేతులు చాపుకో లేదు. తర్వాత ఓ అరగంటసేపు (అంటే ఓ అరనిముషం సేపు) వాళ్ళు ఒకళ్ల నొకళ్ళు ఒళ్లంతా కళ్ళు చేసుకొని చూస్తుంటే మేమంతా మతిపోయి వాళ్ల కేసే గుడ్లప్పగించి ఉండిపోయాం.

ఆ తర్వాత డైలాగులు సుబ్బారావు, వాళ్ల రాణియే నడుపుకున్నారు. ''ఇక్కడ పి. యు. సి. లో చేరి వారం అయింది. నువ్వు కనిపిస్తావని కళ్లు కాయలు కాసే టట్టు రోజూ కాలేజీలో చూస్తున్నాను.''

''అరెరె అంతెందుకు రాణీ కార్డుతో కబురంపితే నీ ముందుకు వచ్చి వాలేవాణ్ణి కదా.''

మేమంతా సుబ్బిగాడి పతనానికి ముక్కుల మీద వేళ్లేసుకు చూస్తున్నాం.

''కబురంపటానికి నీ అడ్రసు కావాలని తెలుస్తే కదా!''

"ఔనౌను పాపం, ప్చ్'' అన్నాడు సుబ్బులు విచారంగా!

తర్వాత ఎవరెక్కడున్నదీ, యెలా వున్నదీ గడగడా అరుగేసుకుంటూ చెప్పేసు కుంటున్నారు.

ఇంతలో హేమ ఒక పెద్ద జంబుఖానా తెచ్చి పరిచి "నుంచునే వున్నారు పాపం కూర్చోండి ''అంది ప్రెసిడెంటుని.

"ఆడవాళ్ళు వాళ్ళు చాప మీదా మేము జంబుఖానా మీదు కూర్చున్నాం.

''అయితే మీ నాన్న ఉత్తరం.'' అన్నాడు సుబ్బారావు.

''నేను గట్టిగా గిల్లి, మెల్లిగా మనం వచ్చిన పనిరా!'' అన్నాడు.

వాడసలు వినిపించులేదు.

హేమ కాఫీ తెచ్చి అందరికీ యిచ్చింది.

సుబ్బిగాడు కాఫీగ్లాసు చేత్తో పుచ్చుకొని, కాఫీతో రాణి సౌందర్యాన్ని కలుపుకుని గడగడా తాగేస్తున్నాడు.

నా కిలా బాధ కలిగి వాణ్ణి. ఇంకొంచెం గట్టిగా కాలిమీద గిల్లాను.

"స్స ...స్స ...అన్నాడు'' కాలు రాసుకుంటూ

హేమ పక పకా నవ్వింది.

''చిదానంద్ గారూ ఆయనెందుకు అంత బంధిస్తారూ?'' అంటూ. అందరం తెల్లబోయి హేమకేసి చూశాం. అప్పటికి కానీ ఈ లోకంలో పడలేదు సుబ్బారావు. హేమ నవ్వుతూనే వుంది. మా కందరికీ

ధైర్యం వచ్చింది
రామకృష్ణ ఏదో దబాయించబోయాడు, కానీ శాస్త్రింకా ముందుగా మాట్లాడేశాడు.
"థాంక్సండీ యింత తొందరలో మా కందరికీ కాఫీ ఎల్లా తెచ్చారండీ మీరు" ప్రశంసిస్తున్న కంఠంతో అన్నాడు.
వెధవ. హేమ వాడి ఫేవరేట్.
"మరేమిటనుకున్నారు ఆడవాళ్ళంటే" అంది హేమ.
"సావిట్లో కామధేనువుని కట్టేసుకున్న దేవేంద్రుడి చెల్లెంలాగ.
"అబ్బో మీ గొప్పలు చాలా విన్నారు లెండి. మా శర్మ నెందుకేడిపించారు?" అని కొంచెం కోపంగా అన్నాడు రామ కృష్ణ.
వాడంత చవటలాగ ప్రవర్తిస్తాడనుకో లేదు నేను. ఆడవాళ్ళు ముగ్గురూ ఒక్క క్షణం విస్తుపోయి తర్వాత పకపకా నవ్వే శారు.
"మేమేం గిల్లామా! కొట్టామా మీ శర్మగారు ఏడవటానికి"
"సరదాగా! ఏడిపించుంటారు ...అంది రాణి వెటకారంగా."
"యిహిహీ" అంటూ ఆ నవ్వే ఆడ వాళ్ళతో గొంతుకలిపాడు సుబ్బారావు.
"యిహిహీ అంటా వేరా? మీ రాణీ వేసిందనా విట్టు" అన్నాను నేను కసిగా.
"వెధవ ఆడాళ్ళు వేసిన విట్టుకి నవ్వాడు అన్నాడు శర్మ వాడికి ముళ్ళ మీద కూరు న్నట్టుంది.
"ఏం ఆడవాళ్ళు మీ కెందులో తీసి పోయారు" అంది మధ్యలో వున్న మ్మాయి
కానీ రాణీ అడ్డు యొచ్చి ఖంగున అడి గింది. "వుండవోయ్ లతా! ఏం బాబూ! మీరు హేట్ ది లేడీ అసోసియేషన్ పెట్టా రటగా!"
ఆ ప్రశ్నకి రామకృష్ణ జవాబు చెప్పాడు.
"అసలు ఆడవాళ్ళని నమ్మ కూడదు పచ్చి మోసగాళ్ళు వాళ్ళు పైగా ఏ అసోసి యేషనైనా స్థాపించికోవటానికి హక్కు యిండియాలో ప్రతి సిటిజన్‌కీ వుంది" అన్నాడు కాబోయే లాయరు ఆచారి.
"అయినా దాంట్లో ఒకతెగని అవ మానించే పద్ధతి వుంది కాబట్టి మీ సంఘ సభ్యులందర్నీ ప్రాసిక్యూట్ చేయిస్తాను." అని దబాయించింది రాణి.
(ఆమె జడ్జీ అవుతుందని ఆమె జాతకంలో ఉన్నట్టు సుబ్బారావు తర్వాత చెప్పాడు.)
ఆచారి "హ హ్హ హ్హ' అంటూ విల న్లా నవ్వుతూ.
"మీకు సాక్ష్యం యిచ్చేదెవరు? మళ్ళా మమల్నే బతిమాలుకోవాలి' అన్నాడు.
"అయినా దేశంలో ఆడవాళ్ళచే మోస గించబడిన మొగాళ్ళు ఎక్కువున్నారో మొగాళ్ళ చేత మోసగించబడిన ఆడాళ్ళె క్కువున్నారో స్టేటిస్టిక్స్ కలెక్టు

చెయ్యండి తెలుస్తుంది'' అంది లత.

"ఏమీ ఆ స్టేటిస్టిక్స్ మా కెందుకమ్మా మేమేం ఎం. ఎల్. ఏకి కడుతున్నామా'' అన్నాడు శర్మ

''అసలు మహా భారత యుద్ధం తెచ్చిం దెవరు! ఆడదేగా!''

"ఎందుకని? మీ మగాళ్ళు చేసిన అవక తవకలకే'' అంది హేమ. ప్రోమ్ఫుగా.

"అయినా మా కవన్నీ తెలియదు. పైగా సుమతీ శతకంలో కూడా చెప్పాడు ఆడాళ్ళని నమ్మద్దని కదురా ఆచారీ!'' అన్నారు అప్పారావు కల్పించుకుని.

''అవునవును అసలు నమ్మొద్దన్నాడు. అన్నాడు ఆచారి ఉలిక్కిపడి.''

ఇంత మంది యిన్ని మాట్లాడినా సుబ్బారావు పన్ను బయట పెట్టి ఒక్క మాట కూడా మాట్టాడలేదు. కారణం అగ్రాహ్యం.

"ఒక రీజను, లాజిక్కూలేని వాళ్ళకేం చెబుతాం.'' అంది చిరాగ్గా.

"మమ్మల్నేం చెప్పమంటం లేదే మా శర్మకి క్షమాపణ చెప్పండి చాలు'' అన్నాడు కంక్లూజన్ కొచ్చి రామకృష్ణ.

"మేమేం తప్పుచేశామనీ . క్షమాపణ చెప్పుకోటానికి?'' అంటూ దీర్ఘం తీసింది లత.

"ఏమి చెప్పం! కావాలంటే.' ఫలానా ఆడపిల్లలు మా 'శర్మ నేడిపించారూ అని ప్రిన్స్‌పాల్‌కి రిపోర్ట్ చేసుకొండి లేకపోతే కోర్టులో దావా వేసుకొండి సాక్ష్యం మేమే చెబుతాం అంతగా ప్రాధేయపడితే'' అంది రాణి హేళనగా మా ముఖాలవంకచూస్తు.

రామకృష్ణ అన్నాడు "చూశారా ఆడ ళ్ళంటే ఇంత మొండివాళ్ళు కనకనే నేన సలు మన ఆసోసియేషన్ లేవతీశాను.''

''అసోసియేషన్ కాకపోతే జెండా లిచ్చుకుని ఊరేగండి'' అంది రాణి

''మా బావే పెద్ద జండా పుచ్చుకుని ముందు నుంచునేది. వాడే ప్రెసిడెంటు'' అన్నాను నేను కొంచెం రోషంగా.

హేమ పకపకా నవ్వింది. ''ఎంత అమాయకులండీ యింకా ఆయన మీ అసోసియేషన్ మెంబరను కుంటున్నారా యిక్కడికి రాగానే రిజైన్ చేశారు'' అం..

"అంతా శర్మ . మీ శాస్ .... ఐమీన్ మా శాస్త్రికూడా అట్లాగే కనపడు తున్నాడు వాలకం చూస్తే'' అన్నాడు అప్పారావు.

"అయితే మీరు క్షమాపణ చెప్పరన్న మాట ' అన్నారు రామకృష్ణ ఆఖరుసారిగా

"చెప్పం ముమ్మాటికీ చెప్పం . ''

ఖంగుమన్నాయి మూడు కంఠాలు.

"సరే అయితే అదేవో మనమూ చూద్దాం రండ్రా పోదాం'' అని దబా యింపుగా లేచాడు రామకృష్ణ. అందరం లేచేం. రాణి నవ్వుతూ అంది'' మరి మేం శలవు తీసుకుంటాం.''

"స్స్ మన ఫేమంతా పడిపోయిం దిరా'' అన్నాను కాని విచారంగా....

తర్వాత యీ ఫాల్‌కంతకీ కారకుడైన సుబ్బారావుని కడిగేశాం.

"ఒరేయ్ ఒరేయ్ మనం మర్చిపోయి ఆడాళ్ళిచ్చిన కాఫీ తాగేశాం" రామకృష్ణ.

* * *

తర్వాత ఆదివారనాడు "కంప్లెంట్స్ ప్లీజ్" అన్నాడు సుబ్బారావు.

అప్పారావు! ఆచారి పెళ్ళి చేసుకోబోతున్నాడని మొన్న వాళ్ళ నాన్నొచ్చి డిక్లేర్ చేశాడు."

"అసలీ ప్రెసిడెంట్‌మీద నోకాన్ఫిడెన్స్ మోషన్ పేరు విన్నాను. మొన్న సినిమాలో ఆడాళ్ళపక్కని కూచుని కనిపించాడు." అన్నాను నేను

సుబ్బారావు సంజాయిషీ యిచ్చుకున్నాడు "నేను కూర్చోలేదు వాళ్ళొచ్చి నా పక్కని కూచున్నారు."

"మొన్న చిదానంద్ ఎలక్ష్యుషన్‌లో నెగ్గినప్పుడు లీల. గాలి వీచే వైపునుండి కంగ్రాచ్యులేషన్స్ చెప్తే వీడు థాంక్స్ చెప్పాడు" అన్నాడు శాస్త్రి

"అయితే అప్పుడు గాలి ఎటువీస్తోందో చూశావా?" క్రాస్‌చేశాను నేను.

"ఆ చూశాను లీల తల్లో వున్న మొగలి పువ్వు వాసన నాకు తగిలింది."

"అయితే నువ్వూ అపవిత్రుడివై పోయావు పైగా నువ్వు హేమని ప్రేమించటంలా' అన్నాడు శర్మ

"ఏడిశావు లేవోయ్ పెద్ద నువ్వు కానట్టు అక్కడికి మొన్న నువ్వు మీ పక్కింటి అమ్మాయిదగ్గర పత్రిక తీసుకో లేదూ? అందులో ప్రేమలేఖ లేదూ?" అన్నాను నేను.

'యేం ప్రెసిడెంటు తక్కువతిన్నాడా రాణిని పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చాట్ట."

'ఛ ఛ యిదేనా మన అసోసియేషన్" అన్నాయి అన్ని కంఠాలూ ఒక్కసారిగా. సిగ్గునీ ఆనందాన్నీ నింపుకుని.

# జ్యోతి చిన్న కథల పోటీ

మీరు ఎన్నో పత్రికలు చదువుతారు. జ్యోతి (కొని-మరీ) చదువుతారు. కథలంటే చెవి కోసుకునేంత పని కూడా చేసేస్తారు మీకంత ఇష్టం కథలు రాయడం కూడా మీకంత యిష్టమేనని కూడా మాకు తెలుసు. మీలాంటి సరికొత్త కథారచయిత (త్రు) లను ప్రోత్సహించాలని మేమో శీర్షిక ప్రారంభం చేస్తున్నాం.

ప్రతి వ్యక్తిలోనూ కథకుడి ప్రవృత్తి అంతర్గతంగా దాగివుంటుంది. చిన్న ప్రోత్సాహం చాలు అది బయటికి వచ్చేస్తుంది. ఈనాడు మాస్టర్‌పీస్‌లు రాసిన చెయ్యి తిరిగిన రచయింతలందరూ ఓనాడు బుర్ర గోక్కుంటూ తెల్లకాగితాల వేపు చూసిన వాళ్ళే .... అంచేత కేవలం ప్రారంభ కథా రచయిత (త్రు) లందరి కోసం జ్యోతి ఈ కథల పోటీని నిర్వహించ బోతున్నది. ఈ శీర్షిక కింద వచ్చిన కథలలో మూడింటిని ఉత్తమ మైనవిగా నిర్ణయిస్తాము. ఆయా రచయిత (త్రు) లకు ఒక సంవత్సరం పాటు 'జ్యోతి'ని బహుమతిగా పంపిస్తాం.

ఈ శీర్షికకు న్యాయనిర్ణేతలుగా ఇద్దరు ప్రఖ్యాత సాహితీవేత్తలు వ్యవహరిస్తారు.

ఒక కులీమరాలైన యువతి మరో కులానికి చెందిన యువకుడిని వివాహం చేసుకోబోవటం ఇతివృత్తం. ఆ యిద్దరూ ప్రేమించుకొన్నారు. అనక వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోనూ వచ్చు మాననూ వచ్చు. లేదా ఒకరినొకరు ద్రోహం చేసుకోనూ వొచ్చు. లెదా పెళ్ళి చేసుకొన్నాక ఎన్నో బాధల గాథలను (అవేమిటో-ఎట్లాంటివో మీరే చెప్పాలి) ఎదుర్కొనూవొచ్చు అది మీ ఇష్టం. కథ మాత్రం యిది! ప్రారంభం ముగింపూ మీవే!

రచయిత (త్రు) లందరూ ఈ క్రింది సూచనలు విధిగా అనుసరించాలని మనవి.

1. కథ కాగితానికి ఒక పక్కే రాయాలి.
2. అరఠావు సైజులో 4 పేజీలకు మించరాదు.
3. పోటీకి వచ్చిన కథలు ఎట్టి పరిస్థితుల్లోనూ తిప్పి పంపబడవు.
4. మేమిచ్చిన ఇతివృత్తాన్నే కథగా రాయాలి.
5. 15 జనవరి 1971 తర్వాత వచ్చిన కథలు పరిశీలించలేము.
6. కథలను 'చిన్న కథల పోటీ' అని Superscribe చేసిన కవర్లో JYOTI, 26 Burkit Road, T, Nagar, Madras-17. అన్న చిరునామాకు పంపాలి.

—మేనేజింగ్ ఎడిటర్.

# ఆశల శిఖరాలు

## 15

భాస్కరం - నేను ఇంచుమించు ఒకే వయసువాళ్ళం. భాస్కరం నాకు ఏ కాస్త చేదోడుగా వున్నా, ఈ పత్రిక విషయంలో నేను మరింత విజయం సాధించేవాడిని. భాస్కరానికి నన్ను చూస్తే ఎందుకింత ఆగ్రహమో నాకు తెలియటంలేదు. న్యాయానికి సుదర్శనం గారికి సుస్తీ చేసినప్పుడు కాని, అంతక్రితం కానీ, అతను యీ పత్రిక విషయంలో ఏమాత్రం బాధ్యతగా ప్రవర్తించినా-నాలాటి పరాయి మనిషి యీ ప్రాంగణంలో అడుగుపెట్టే అవసరం వచ్చేది కాదు.భాస్కరంలాటి వాళ్ళకి బాధ్యతపంచుకోవటం రాదుకాని, అధికారం గుర్తు చేయటం చాలా బాగా వస్తుంది. ఈ పత్రిక విషయంలో అతను ఏరకంగానూ, నాకు తోడుపడకపోగా, పైనుంచి ప్రతి చిన్న విషయంలో నేనున్నాను అంటూ అడ్డు రాసాగాడు.

మూర్తిగారు ఒకసారి శలవు కావాలన్నాడు. ఆఫీసులో పని వత్తిడి ఎక్కువగా వుంది. ఒక్క రెండు రోజుల తర్వాత తీసుకోమని కోరాను అతను వెళ్ళి భాస్కరానికి ఏం చెప్పాడో తెలియదు భాస్కరం రంయ్ మంటూ నా గదిలోకి దూసుకు వచ్చాడు.

వస్తూనే నన్ను నిలదీస్తున్నట్టుగా అన్నాడు.

'ఏమిటి నీ వుద్దేశం? ఈ రోజు అడిగిన శలవు రెండు రోజుల తర్వాత యిస్తానన్నావు?''

''ఆఫీసులో పని ఎక్కువగా వుంది. శలవు కావాలని ఆయన చెప్పిన కారణం అంత ముఖ్యమైనది కాదు ''

''ముఖ్యమైంది కాదా! పెళ్ళి పెటాకులు కానివాడివి నీకేం తెలుస్తాయి ఆ బాధలు?''

భాస్కరం పలికిన వ్యంగ్యానికి నాలో కోపం కస్సు మన్నట్టు లేచింది. అంతకంటె రెట్టింపు దృఢంగా 'నీకయిందా పెళ్ళి? నీకు తెలుసా బాధ్యత?' అని అడగాలనిపించింది. కానీ ఏం లాభం? మాటకి మాట వస్తే తర్కం అవుతుంది. ఆఫీ

సులో వీళ్ళిద్దరూ పోట్లాడుకుంటున్నారనే మాట బైటికి వెళుతుంది. దానికి వికృతంగా చిలవలు పలవలుగా వేయి అర్ధాలు రావచ్చు. అందుకే తమాయించుకుని పూరుకున్నాను.

కానీ నేను పూరుకున్నా భాస్కరం పూరుకోలేదు, అతని ధోరణి చూస్తే ఏ సాకు దొరుకుతుందా రాద్ధాంతం చేద్దామా అని ఎదురు చూస్తున్నట్టుగా వుంది.

"మూర్తికి ఈరోజు శలవు కావాలిట. నేను గ్రాంట్ చేస్తున్నాను లీవ్" అన్నాడు టేబిల్ మీద కాగితాలన్నీ గబ గబా కలగాపులగం చేస్తూ అప్లికేషన్ కోసం వెతుకుతూ. నేను చప్పున అతని చేతులు పట్టుకున్నాను. అంత క్రితం రెండు గంటల నుండి నేను శ్రద్ధగా పనిచేస్తూ అందులో ముఖ్యమైన వుత్తరాలు ఏరి ఓ ప్రక్కన పెట్టాను, భాస్కరం వాటి నన్నింటినీ కలిపేసాడు.

"ఏమిటీ పని?" అన్నాను. కోపం అణుచుకోవటం నాకు బాధగా లేదు.

"ఏది? ఆయన యిచ్చిన అప్లికేషన్ యిటివ్వు, నేను పెడతాను సంతకం."

"భాస్కరం! నీ యీ ప్రవర్తన బాగ లేదు."

"నీ ప్రవర్తన బాగుందా? మూర్తిగారికి నీకూ అసలు తేడా ఏమిటి? ఆయన ఎంతో, నువ్వూ అంతే! పొట్ట చేత్తో పట్టుకుని వచ్చినవాడికి యింత అహంకారం ఎ౦కి రాదు. చాకచక్యంతో అందరి నెత్తిన చేతులు పెట్టి అధికారం స్వంతం చేసు కోవటం నీలా అందరికీ రాదు!"

నేను భాస్కరం చేతులు వదిలేసాను,

యితనిలా అకుగడుక్కీ విషం గక్కినట్టు యిలా బుసలు ఎందుకు కొడుతున్నాడో నా కర్థం గాలేదు.

రెప్ప వాల్చకుండా అతని వైపే చూడసాగాను.

నా కీ క్షణంలో అతని మీద ఆగ్రహం ఎక్కువ కాలేదు. అతను ప్రదర్శిస్తున్న యీ చర్యలకి వెనక దాగివున్న అసలు భావం ఏమిటో సరిగ్గా తెలుసుకోవాలనిపించ సాగింది.

"ఏది ఆ అప్లికేషను?" రెట్టిస్తున్నట్లూ, అధికారంగా అడిగాడు.

"అది నువ్వు సంతకం పెడితే చెల్లదని నేను గుర్తు చేయాలా?"

భాస్కరం మంటిపడ్డట్లుగా చూసాడు. కనుబొమ మెగరేస్తూ అన్నాడు:

"అదా నీ ధైర్యం! అయితే సరి. మూర్తిగారిని నేను రావద్దని చెబుతాను."

"ఆయన చోటులో నువ్వుండి ఆ పని పూర్తి చేస్తే నాకేం అభ్యంతరం లేదు."

వెళ్ళిపోబోతున్న భాస్కరంగిరుక్కున వెనక్కు తిరిగాడు.

"అంటె నీ వుద్దేశం?"

"ఆ పని అర్జెంట్‌గా అయిపోవాలి."

"అంత అర్జెంట్ అయితే నువ్వే చేసుకో." చాలా నిర్లక్ష్యంగా అన్నాడు.

"నేనా? నేను పూరికే వున్నానా?"

పక్కనున్న ఫైల్స్ చూపించాను.

"వూరికే వుండక ఏం చేస్తున్నావు! అసలు నువ్వు పట్టుమని పని చేసింది ఎక్కడ? సత్యతో కులాసాగా కబుర్లు చెప్పటానికి ఎక్కడలేని టైము చాలటం లేదయ్యో!''

నా ముఖంలోకి సర్రున రక్తం ఒక్కసారి పొంగులా వచ్చింది.

గర్జిస్తున్నట్టుగా అన్నాను.

"భాస్కరం! హద్దుమీరి మాట్లాడకు."

"నీ హద్దులు నువ్వు మర్చిపోకు. ఏం నేనన్నది అబద్ధమా? సత్య నిన్న ఆఫీసుకి రాలేదూ? ఆ టైమ్‌లో మూర్తిగారూ వాళ్ళందరూ కాఫీకి వెళితే ఈ గదిలో మీరిద్దరూ పకపకలాడుతూ కూర్చోలేదూ?''

నేను నోట మాట రానివాడిలా చూడ సాగాను.

నిన్న మధ్యాహ్నం హాస్పిటల్ నుంచి యింటికి వెళుతూ సత్య యిక్కడికి వచ్చిన మాట నిజమే!

ఉదయం ఎక్కువగా పని వుండటం వల్ల నేను సుభద్రమ్మ గారింటికి వెళ్ళ లేదు. నా భుజం మీద గాయం నేను అనుకున్న దానికంటె త్వరగానే నయమైంది. నేను ఉదయం వెళ్ళక పోవటంతో, సుభద్రమ్మగారు నా అశ్రద్ధ గురించి నొచ్చుకుని, సత్యకి మరీ మరీ చెప్పడంతో సత్య మధ్యాహ్నం యిక్కడికి వచ్చింది. నా గాయానికి వున్న కట్టు విప్పి యింకా కొద్దిగా పచ్చి వుండడంతో ప్లాస్టర్ చేసింది.

నిన్న సత్య వచ్చి యిక్కడ వున్న సమయం పట్టుమని 15 నిమిషాలు కూడా లేదు.

సరిగ్గా నేను కాఫీ తాగబోయే ముందు వచ్చింది.

సూర్యాన్ని యింకో కప్పు కాఫీఎక్కువ తీసుకు రమ్మనమని పంపాను,

సూర్యం రావటం కొద్దిగా ఆలస్యం అయింది.

సత్య నా దగ్గర ఫీజు తీసుకోదని నాకు తెలుసు! అయినా సరే మర్యాద కోసం కొంత డబ్బు తీసి కవర్లో పెట్టి, సత్య కెదురుగా టేబిల్ మీద పెడుతూ, "డాక్టర్ గారికి దక్షిణ తాంబూలం'' అన్నాను నవ్వుతూ.

సత్య ఆ కవరు నా వైపు జరిపింది.

"డాక్టరుగారు త్వరలో క్లినిక్ తెర వాలని అనుకుంటున్నారు. ఆ తెరిచి నప్పుడు మొట్ట మొదటి ఫీజు తమ దగ్గరే తీసుకుంటారుట'' అంది చిరునవ్వుతో.

"క్లినిక్ పెట్టే వుద్దేశం వుందా?'' అన్నాను.

సత్య అవునంది.

మా సంభాషణ తర్వాత క్లినిక్ గురించి, దాన్ని నడపడంలోగల సాధక బాధకాలు గురించి జరిగింది.

ఈ లోపల సూర్యం కాఫీ తెచ్చాడు.

మందులు, రోగులు, వాళ్ళ సైకాలజీ వీటి గురించి చెబుతూ సత్య కాఫీ తాగిన తర్వాత కూడా కొద్దిసేపు కూర్చుంది

పోయింది.

నా కూడా ఆ స్టేట్ మెంట్ తెలియ లేదు.

తర్వాత సత్య వెళ్ళిపోయింది. నా పనిలో నేను మునిగిపోయాను, ఈ కాస్త దానికి భాస్కరం యింత వికృతంగా మాట్లాడటం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. భాస్కరం చూపుతున్న యీ వక్ర బుద్ధికి అసహ్యం కూడా వేసింది.

మా యిద్దరి మధ్యా వున్న స్పర్ధలో సత్యని యిఒకించటం ఎందుకో నా కర్థం గాలేదు.

భాస్కరాన్ని అనవసరంగా మాటలు బాధ్యత పెట్టాం. అది అతన్ని నిర్వర్తిం చనీ! ఆ మంచి చెడులన్ని అతణ్ణే చూసు కోనీ" అన్నారు.

భాస్కరం కొరకొరలాడుతున్నట్టు చూసాడు.

సుదర్శనంగారు నా వైపు తిరిగి అన్నారు,

"రవీ! నేను శారీరకంగా అసమ ర్థుడినై యీ బాధ్యతంతా మీకు అప్ప గించిన మాట నిజమే! నువ్వు భాస్కరం మాటని కూడా మన్నించాలి. నా తర్వాత యజమాని రాణీఅన్న సంగతి మర్చిపో వద్దు." అని హెచ్చరించారు.

# యద్దనపూడి సులోచనారాణి

మీఠతే వూరుకోనని హెచ్చరించాను.

మా యద్దరి మధ్యా రేగిన యీ ఘర్షణ చివరికి సుదర్శనంగారి వరకూ వెళ్ళక తప్పలేదు.

నేను యిష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తు న్నానని, అహంకారంగా మాట్లాడుతు న్నానని భాస్కరం నా ఎదుటే ఆయనకి ఫిర్యాదు చేశాడు,

నేను జరిగినదంతా చెప్పాను.

ఆయన మా యిద్దరి మాటలూ శ్రద్ధగా విన్నాడు.

భాస్కరంతో "అతని మీద ఒక

ఆయన ధోరణి గోడ మీద పిల్లి వాటంగా యిటుపూర్తిగా నావైపుగాకుండా అటు భాస్కరాన్ని బలపరుస్తున్నట్లుగా కాకుండా వుంది.

మర్నాడు మూర్తిగారు ఆఫీసు మానే సాడు. దాని ఫలితంగా నేను రెండు రోజులు వరసగా రాత్రి తెల్లవార్లూ కూర్చుని పని చేయాల్సి వచ్చింది.

మనుష్యుల మధ్య వైషమ్యం వుండనే వుండకూడదు, వుంటే ఒక సంఘటన ఒకరు సర్దుకు పోయినంత మాత్రాన సమసిపోనే పోదు. అప్పుడప్పుడూ అది

చిటపటలాడి అగ్ని రవ్వలు ఎగురుతూనే వుంటాయి.

సాధ్యమయినంతవరకూ భాస్కరంతో ఘర్షణ పడకుండా వుండటానికి, నేను విశ్వప్రయత్నం చేయసాగాను. కానీ సాధ్యం కాలేదు.

పై సంఘటన జరిగిన వారం రోజులకి ఆ రోజున నేను సూర్యాన్ని పిలిచి అర్జెంట్ అని చెప్పి కొన్ని వుత్తరాలు పోస్టుచేసి రమ్మన్నాను.

సూర్యం వెళుతుంటే భాస్కరం పిలిచి కాఫీ తెమ్మని చెప్పాట్ట. సూర్యం ఒక్క పావుగంటలో వచ్చేస్తానని, చేతిలో వున్నవి చూపిస్తూ అవి అర్జెంట్ అని చెప్పాట్ట!

భాస్కరం ముందు తను చెప్పిన పని చేయాలి అన్నారు!

సూర్యం అయ్యగారితో చెప్పండి అన్నాడు.

మాటకి మాట ఎదురు చెబుతావురా రాస్కెల్!' అంటూ భాస్కరం సూర్యం చెంప మీద కొట్టాడు.

సూర్యం మాటపడే మనిషి కాదు. తిరగబడ్డాడు. దాంతో భాస్కరానికి యింకా ఆగ్రహం వచ్చింది. సూర్యాన్ని పట్టుకుని బాదటాదాడు.

నా ఆఫీసు రూమ్‌కి గోల విని పించి నేను లేచి వెళ్ళేసరికే శర్మ - మూర్తి గారిద్దరూ భాస్కరం చేతుల్లోని సూర్యాన్ని విడిపించటానికి ప్రయత్నిస్తున్నారు.

నేను విషయం ఏమిటని అడిగాను.

భాస్కరం కళ్లెర్ర చేస్తూ అన్నాడు.

"ఏమిటా! నువ్వెక్కించిన పొగరు చూడు. ఎలా మాట్లాడేట్టు చేస్తోందో? పీ అలుసు చూసుకునే యీ వెధవకి యింత నిర్లక్ష్యం.

"వెధవా గిధవా అన్నావంటే వూరు కొనేది లేదు'' సూర్యం భాస్కరం మీద కలబడబోయాడు.,

నేను సూర్యం భుజం పట్టుకుని ఆపే సాను.

సూర్యాన్ని ఆఫీసులోనుంచి తరిమే యాలని పట్టు పట్టాడు భాస్కరం, సూర్యం చేసిన తప్పేమిటో చెప్పమ న్నాను. ఆ సాయంత్రం సుభద్రమ్మగారికి ఫోన్‌లో చెప్పేసాను, యిలా భాస్కరం అడుగడుక్కీ గొడవ చేస్తే పత్రిక పని చూడటం నావల్ల కాదన్నాను. ఆవిడ ఓపిక పట్టమంటూరు. భాస్కరం మాటలు లక్ష్య పెట్టవద్దంటూరు. కానీ అదెలా సాధ్యం?

భాస్కరం ధోరణి నా కర్థమైంది. పత్రిక యిప్పు డిప్పుడే పేరులోకివస్తోంది, రోజు రోజుకి సర్క్యులేషన్ పెరుగుతోంది పాపులారిటీ వస్తోంది. ఏ రకంగా నైనా నన్ను యిందులో నుంచి బైటకి నెట్టి యీ ఎడిటర్ హోదా తను తీసుకోవాలని భాస్కరం దృఢ నిశ్చయంలా వుంది. నా క్రింద అతను పని చేయటం అనేది

అతనికి చాలా సిగ్గుగా, ఉన్నతవంగా వున్నట్టుంది. రాను రాను అతని చేష్టల మూలంగా, మాటల ధోరణినిబట్టి అతని మనస్సులో నేను కంటకంగా తయారై నానని, సాధ్యమయినంత త్వరలో నన్ను తీసి అవతల పడేయాలని అతను తహ తహ లాడుతున్నట్టు నేను తెలుసుకో గలిగాను. భవిష్యత్ పట్ల అన్ని నమ్మకలూ పోగొట్టుకున్న చీకటి దినాల్లో నా చేతికి అదృష్టవశాత్తూ దొరికిన ఆధారం యిది! దీన్ని ఆలంబనగా చేసుకుని నా ఆశలు, కలలు యదార్ధ రూపానికి తెచ్చుకోటానికి నిరంతరం కృషి చేస్తూ, రాత్రనకా పగ లనకా శ్రమ పడుతున్న నేను ఓ పట్టాన ఓటమి ఒప్పుకోవటానికి, దీని నుంచి విడి పోయి వెళ్ళిపోటానికి సిద్ధంగా లేనని భాస్కరానికి తెలియదేమో!

నన్ను ఎలాగైనా వెళ్ళగొట్టి తీరాలని భాస్కరం పట్టుదల! ఏమైనాసరే యీ పత్రికని వదలకూడదని నా గట్టి నిర్ణయం, దాంతో మేం యిద్దరం ప్రత్యర్థులుగా తయారయాం! మా మధ్య పరోక్షంగా యుద్ధం ప్రారంభమైంది,

(సశేషం)

---

ఒకాయన టాక్సీ ఎక్కి రోడ్లన్నీ తిరిగితిరిగి చివరికి డబ్బు ఇవ్వలేనని తెలుసుకున్నాడు. ఓ చోట "అవు. ఇక్కడ దిగిపోతా" నన్నాడు. టాక్సీ ఆగింది.

"నీ దగ్గర అగ్గిపెట్టె వుందా? పోనీ టార్చిలైట్?"

"లేవండి. ఏం?"

"వెనక సీటులో ఒక వందరూపాయల నోటు పడిపోయింది. మడతెట్టి చేత్తో పట్టుకున్నాను. ఇంతలో కేమైందో వెతకాలి ఉండు; ఆ సిగరెట్టు కొట్లో అగ్గిపెట్టె కొనితెస్తాను." అని వెళ్ళాడు ఆసామీ,

అతను అగ్గిపెట్టె కొనుక్కొచ్చేసరికి, అతను అనుకున్నట్టుగానే అక్కడ టాక్సీ లేదు; ఆ డ్రయివరూ లేడు!



ఆబాలగోపాలం (మీ అందరూ)కీ ఆసక్తికరమైన

అతి చక్కని అంశం

(వివరాలకి జనవరి సంచికలో ఇదే పేజీలో చూడండి)




## ప్రేమ జీవులు

కొందరి జీవితాలలో ప్రేమ పండు వెన్నెలలు కురిపిస్తుంది. మరికొందరి జీవితాలలో సుడిగాలి, వడగాలి చెలరేగుతుంది. కేరళ ప్రాంతంలోని ఒక కుగ్రామంలో జరిగిన వాస్తవ ప్రణయగాధే సంజీవనీ ఫిలింస్ వారి సాంఘిక చిత్రం 'ప్రేమ జీవులు' అక్టోబర్ నవంబర్ నెలల్లో జరిగిన షెడ్యూల్స్‌తో పన్నెండు రీళ్ళ చిత్రం పూర్తయింది. డిసెంబర్‌లో జరిగే చివరి షెడ్యూల్‌తో చిత్రం పూర్తవుతుంది.

అతి త్వరలో ఆంధ్రదేశమంతా విడుదల కానున్న ఈ చిత్రంలో నటప్రపూర్ణ కాంతారావు, బాలకృష్ణ, ధూళిపాళ, రాజబాబు, అల్లురామలింగయ్య, రావికొండల రావు, బాలకృష్ణ, కె. కె. శర్మ, సత్తిబాబు, రాంబాబు, రాజశ్రీ, సంధ్యారాణి, నిర్మల ప్రధాన పాత్రలు ధరిస్తున్నారు. మాటలు: కణ్వశ్రీ, పాటలు; పి. నారాయణరెడ్డి, దాశరధి, కొసరాజు, సంగీతం: విజయాకృష్ణమూర్తి. కెమెరా: అన్నయ్య. ఎడిటింగ్: కె. గోపాల్‌రావు, మేకప్: కృష్ణ, అసోసియేట్ డైరెక్టర్: చక్రవర్తి, దర్శకుడు: కె. ఎస్. ఆర్. దాస్, నిర్మాతలు: జి రామం, చంద్రశేఖర్.

## నవరత్న ఆర్ట్స్

వినోదప్రధానమైన విచిత్ర సాంఘికం నవరత్న ఆర్ట్స్ వారి తొలి సాంఘిక చిత్రం. సున్నితంగా, హాస్యపూరితంగా కథ చిత్రీకరించడమే ధ్యేయంగా పెట్టుకున్నాడు కథకుడూ, దర్శకుడూ. వెరైటీ కోసం ఎదురుచూసే నటీనటులకు ఈ చిత్రంలో కొత్త తరహా పాత్రలు లభించినందుకు నాగభూషణం, విజయ నిర్మల, హరనాథ్, రామ్మోహన్ ఎంతో హుషారుగా నటిస్తున్నారని వార్తలు. 3 రీళ్ళు పూర్తయిన చిత్రంలో హరనాథ్, రామ్మోహన్, నాగభూషణం, పెరుమాళ్లు, రమణారెడ్డి, విజయనిర్మల, హేమలత, సవితాదేవి, రమాదేవి, అన్నపూర్ణమ్మ, నూతన నటి శ్యామల నటిస్తున్నారు. ఛాయా



శ్రీ పద్మావతీ ఫిలింస్ "అందరికీ మొనగాడు"లో
కృష్ణ, భారతి, పెన్నీరాడై నిర్మల.

మాధవ్ బుల్‌బులే, సంగీతం విరల్ & ముంతాజ్, కూర్పు మార్తాండ్, ప్రొడక్షన్ మేనేజర్ టి పి రంగారావు, దర్శకుడు అనిసెట్టి అప్పారావు, నిర్మాత ఖాదర్

కథా నాయకురాలు

సరికొత్త సంవిధానంలో మంచి సస్పెన్స్‌ని మేళవించి నవరసభరితంగా శ్రీ సరస్వతీ చిత్రవారు నిర్మిస్తున్న విప్లవాత్మక సంచలన చిత్రం 'కథా నాయకురాలు' విడుదలకు ముస్తాబు చేసుకుంటోంది నవంబర్‌లో అత్యంత సహజంగా నిర్మింపబడిన కార్మికవాడ సెట్‌లో—ఓ ఉగ్ర కథను వాణిశ్రీ, మోమకూరి సత్యం, పెద్దన్నలపై చిత్రీకరించేరు ఈ నెలలో జరిగే తుది షెడ్యూల్ షూటింగ్‌లో మహాకవి శ్రీశ్రీ రచించిన వ్యంగ్య నృత్య గేయం 'అభినవప్రహ్లాద'ను కొత్త తరహాలో చిత్రీకరించడం జరుగుతుంది వాణిశ్రీ, శోభన్‌బాబు, నాగభూషణం, పుష్పకుమారి, అల్లురామలింగయ్య ఛాయాదేవి, రాజ

బాబు, వరలక్ష్మి, రామ్మోహన్, విజయశ్రీ, జ్యోతిలక్ష్మి ముఖ్య పాత్రధారులు. మాటలు: రెంటాల గోపాలకృష్ణ, పాటలు. శ్రీశ్రీ, ఆరుద్ర, సుంకర, ఏల్చూరి, సిక రాజు, విజయరత్న; సంగీతం: ఎ. ఎ. రాజ్, ఛాయ: ఎస్. ఎస్. లాల్, నిర్మాతలు, గిడుతూరి సూర్యం, నల్ల వెంకట్రావు, కధ, స్క్రీన్ప్లే, దర్శకత్వం: గిడుతూరి సూర్యం. విడుదల: పూర్ణా.

## అందరికీ మొనగాడు

శ్రీ పద్మావతీ ఫిలింస్ వారి గూఢచారి చిత్రం 'అందరికీ మొనగాడు' నిర్మాణం పూర్తయింది. కృష్ణ, గుమ్మడి, రాజ్ బాబు, ప్రభాకరరెడ్డి, ముక్కామల, కె.జగ్గారావు, రావికొండలరావు, నెల్లూరు కాంతారావు, భారతి, విజయలలిత, గీతాంజలి, జ్యోతిలక్ష్మి, వెన్నిరాడై నిర్మల, సురేఖ, విజయభాను, శ్యామల ఈ చిత్రంలోని



శ్రీ లక్ష్మి పిక్చర్స్ & కో వారి "పట్టిందల్లా బంగారం"లో నటుడు చలం-వర్తకె హాలం.



పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారి "విక్రమార్క విజయం"లో మిక్కిలినేని, రామకృష్ణ, బాలయ్య.

ముఖ్య తారాగణం, మామూలు చిత్రాలకు పూర్తిగా భిన్నమైన ఈ చిత్ర కథను జేమ్స్‌బాండ్ చిత్రాలకు సరితూగేలా— ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొని, వివిధ ప్రదేశాల్లో షూట్ చేశారు మొట్టమొదటి గూఢచారి చిత్రం 'గూఢచారి 116' దర్శకుడు ఎం. మల్లికార్జునరావే ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు, కవ్విస్తూ రెచ్చగొట్టే అందకత్తెల నృత్యాలు మృదుమధురమైన సంగీతం ఈ చిత్రంలోని ఆకర్షణలు, రచన ఆరుద్ర, నృత్యాలు: హీరోలాల్, చిన్ని-సంపత్, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, సహనిర్మాత: వి బాబు, కెమెరా: వి. ఎస్. ఆర్. స్వామి, సంగీతం: కె. వి. మహాదేవన్, నిర్మాత, దర్శకుడు: ఎం. మల్లికార్జునరావు. విడుదల: పూర్ణా.

### విశ్వభారతి ప్రొడక్షన్స్

విశ్వభారతి వారి తొలిచిత్రం షూటింగ్ ఇటీవల సారధీ స్టుడియోలో నవంబర్ 9 నుండి 16 వరకూ నిర్విరామంగా జరిగింది నాగేశ్వరరావు, జమున, గుమ్మడి మొదలగు వారితో మరికొన్ని

ప్రధాన రసవత్తర ఘట్టాలను దర్శకులు ప్రతిభావంతంగా చిత్రీకరించేరు దాశరధి రచించిన 'చిట్టిపొట్టి బొమ్మలు, చిన్నారి బొమ్మలు, బుల్లిబుల్లి రాధకు, ముద్దు రాజుకు పెండ్లి, పెళ్ళి ' పాటను సుశీల, జిక్కి పాడగా వాహినీ స్టుడియోలో యిటీవల రికార్డ్ చేశారు

నాగేశ్వరరావు జమున నాయకానాయికలుగా నటిస్తోన్న ఈ చిత్రానికి కధ సంభాషణలు ముళ్లపూడి వెంకటరమణ ఇంకా గుమ్మడి, రమణారెడ్డి, సూర్యకాంతం జయకుమారి, రాజబాబు, రావి కొండల రావు మొదలగువారు ప్రధాన నటవర్గం పాటలు దాశరధి, ఆరుద్ర, కొసరాజు పినారె సంగీతం టి చలపతిరావు, ఫోటోగ్రఫీ కె ఎస్ రామకృష్ణ, దర్శకుడు కె ప్రత్యగాత్మ, నిర్మాత జి రాధ కృష్ణమూర్తి.

## జీవిత చక్రం

నవశక్తి ప్రొడక్షన్స్ వారి 'జీవిత



విజయా & సురేష్ కంబైన్స్ వారి
'ద్రోహి'లో కృష్ణంరాజు, త్యాగరాజు, వాణిశ్రీ



శ్రీ పద్మావతి ఫిలింస్ 'అందరికీ మొనగాడు'లో
కృష్ణ, జ్యోతిలక్ష్మి.



శ్రీ పద్మావతి ఫిలింస్ 'అందరికీ మొనగాడు'లో
భారతి, ప్రభాకరరెడ్డి, కృష్ణ.

చక్రం'లో ఎన్. టి. ఆర్: నాగయ్య, రేలంగి, రమణారెడ్డి, పద్మనాభం, పెరుమాళ్లు, రావికొండలరావు, ప్రభాకరరెడ్డి, వాణిశ్రీ, శారద, శ్రీరంజని, హేమలత, రాజకుమారి, సురభి బాలసరస్వతి, శ్యామల పాల్గొన్నారు. సమర్పణ: లింగిచెట్టి. మాటలు: ఆత్రేయ, కణ్వశ్రీ. సంగీతం: శంకర్ జైకిషన్ ఛాయ: జె సత్యనారాయణ నృత్యాలు: చిన్ని సంపత్. దర్శకత్వం సి. ఎస్ రావు

## చిత్రాలయ

ప్రఖ్యాత తమిళ రచయిత, దర్శక నిర్మాత సి. వి. శ్రీధర్ చిత్రాలయ బేనర్ కింద నిర్మించబోతున్న తెలుగు చిత్రంలో శోభన్‌బాబు, చంద్రకళ నాయికీనాయకులు. మాటలు: ఎన్. ఆర్. నంది. సంగీతం: కె వి. మహాదేవన్. ఛాయ: యు. రాజగోపాల్. నిర్వహణ; వై. కన్నయ్య.

## ద్రోహి

కూతురికి తండ్రిని తెలీదు తండ్రికి

ఆమె తన కూతురనీ తెలిసు....వాడెవడో ఖూనీలు చేశాడు, దార్లు కొట్టేసు, దోపిడీలూ చేశాడు... వాడు మంచివాడు.... తను ఆడిందల్లా ఒక అబద్ధం ...జను ... ద్రోహి ! ఏది న్యాయం. చక్కని చిక్కని ఉత్కంఠర కలిగించే కథతో కమ్మని సంగీతంతో కన్నుల పండుగ కలిగించే చిత్రం 'ద్రోహి'. విజయా అండ్ సురేష్ కంబైన్స్ పతాకం కింద శ్రీ డి. రామానాయుడు సమర్పిస్తున్నారు.

జగ్గయ్య, నాగభూషణం, కృష్ణంరాజు, త్యాగరాజు, జగ్గారావు. కె. వి. చలం, కాకరాల, సాక్షి రంగారావు, వాణిశ్రీ, దేవిక. ఎస్ వరలక్ష్మి, రమాప్రభ, జ్యోతిలక్ష్మి, అరిత ముఖ్య నటవర్గం.

కథ : కె. మూర్తి. మాటలు : బొల్లిముంత శివరామకృష్ణ. నార్ల చిరంజీవి. గీతాలు : ఆత్రేయ, కొసరాజు, ఆరుద్ర. దాశరధి. సంగీతం : జె. వి. రాఘవులు, నృత్యాలు కె. ఎస్. రెడ్డి, చిన్ని-సంపత్, మహాలింగం, తంగరాజ్, సుందరం, నేపథ్య. గానం ; ఘంటసాల, మాధవపెద్ది, రాఘవులు, సుశీల, ఎల్. ఆర్. ఈశ్వరి విజయలక్ష్మి కన్నారావు, ఫోటోగ్రఫీ : ఎస్ ఎస్. లాల్. దర్శకుడు : కె. బాపయ్య.

## సంక్షిప్త వార్తలు

* టెంపోరావ్, కొమ్మూరి సాంబశివరావుగార్లు రాసిన రెండు చక్కని కథలను విరలాచార్య తెరకెక్కించనున్నారు. ఒక చిత్రానికి కె ఎస్ ఆర్. దాస్, మరోచిత్రానికి కె. వి. నందనరావు దర్శకత్వం నిర్వహించవచ్చు.

* శ్రీ విజయ వెంకటేశ్వరా ఫిలిమ్స్ బేనర్‌లో పి. ఎస్. రాజు నిర్మించే చిత్రానికి ఎ. పి. త్రిలోక్‌చందర్ దర్శకుడు. ఎన్. టి. ఆర్, సావిత్రి ముఖ్య పాత్రధారులు.

* అశ్వరాజ్ మూవీస్‌వారు "పాంచాలి ప్రతిజ్ఞ" నిర్మించబోతున్నారు.

* అరుణ్ మువీస్ సంస్థ ఎ. వి. ఎమ్, వారి సహకారంతో తెలుగులో నిర్మించే చిత్రానికి భమిడిపాటి రాధాకృష్ణ రచన చేస్తున్నారు. దర్శకత్వం ; కె. బాలచందర్.

* కావిలిపాటి విజయలక్ష్మి రాసిన 'విధి విన్యాసాలు' నవలను 'సత్యచిత్ర' వారు కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వంలో తెరకెక్కించనున్నారు. నిర్మాతలు : నెక్కంటి సత్యనారాయణ, గిరిబాబు.



ఇటీవల శ్రీ సహతా యిచ్చిన విందు సందర్భంగా ప్రఖ్యాత నిర్మాత శ్రీ సుబోధ్ ముఖర్జీ, సుందర్లాల్ సహతా, తారవిమి.

---

• ఎన్నో తమిళ, కన్నడ తెలుగు చిత్రాలకు కళా దర్శకుడిగా పని చేసి, ఎన్నో అవార్డ్సు సంపాదించిన సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ టి. వి ఎస్ శర్మ ఈ నెల 7 వుదయం తన 62 వ ఏట మద్రాస్ జెనరల్ హాస్పిటల్‌లో కాలధర్మం చెందారని తెలియజేయడానికి విచారిస్తున్నాం వీరి ఆత్మకు శాంతిని చేకూర్చాలని 'జ్యోతి' భగవంతుని ప్రార్థిస్తోంది

• పద్మనాభం దర్శకత్వంలో బి పురుషోత్తం నిర్మించే రేఖా అండ్ మురళీ అ శృంగార, హాస్య, వీర, కరుణ ప్రధాన చిత్రం 'పిడతంభొట్లు'కి స్వప్న దృశ్యం రంగుల్లో చిత్రీకరించబడింది

• జి ఎ ఆర్ శేషగిరిరావు ( కత్వంలో తోట సుబ్బారావు సమర్పి శ్రీ లక్ష్మి పిక్చర్స్ వారి 'పట్టిం బంగారం'లో అమాయకుడిగా - దుష్టచలం ద్విపాత్రాభినయం చేస్తున్నారు.